Ramanujulu Reddy, Buduru, 1899-

రత్నాబాయి

ప్రొద్దుటూరు, 1925

Record no. 460

Ramanujulu Reddy, Buduru, 1899-

Ratnābāyi

Proddutūru, 1925

Record no. 460

Bibliographic Record Target

Ramanujulu Reddy, Buduru, 1899-
రత్నాబాయి : సాంఘిక నవల / గ్రంథకర్త బూదూరు రామానుజులురెడ్డి. - ప్రొద్దుటూరు : జానకీ ముద్రాక్షరశాల, 1925.
v, vi, 72, vii, 3, 3, 4 p. ;19 cm.
Record no. 460

Ramanujulu Reddy, Buduru, 1899-
Ratnābāyi : sāṅghika navala / granthakarta Būdūru Rāmānujulureḍḍi. - Prodduṭūru : Jānakī Mudrākṣaraśāla, 1925.
v, vi, 72, vii, 3, 3, 4 p. ;19 cm.
Record no. 460

శ్రీ బాలభారతీ గ్రంథనిలయము.

అనుబంధ గ్రంథమాల—౧.

# రత్నాబాయి.

(సాంఘికనవల.)

గ్రంథకర్త:

బూదూరు రామానుజులురెడ్డి.

చి వ్యా ఢ.




జానకీముద్రాక్షరశాల, ప్రొద్దుటూరు.

1925

 వెల రు 0—8—0

# రాజపోషకులు. 1655

మ॥ రా॥ రా॥ శ్రీ. పాణెం యెఱ్ఱమునిరెడ్డిగారు,
ల్యాండులార్డు,
బొల్లవరం.

,, దాసు కేశవరావు పంతులుగారు,
ప్రొప్రైటర్,
వాణీప్రెస్,
బెజవాడ.

,, వి. నాగిరెడ్డిగారు,
ల్యాండులార్డు, ఆంధ్ర మద్రాసు
పాకేష్టుకమిటి మెంబరు,
[illegible]

,, బొల్లని మునిస్వామినాయుడుగారు,
బి. ఎ., బి. యల్., యం. యల్. సి., యఫ్. [illegible]

# పోషకులు.

మ॥ రా॥ రా॥ శ్రీ. యేడిదే. వెంకట్రావుగారు,
ఆంధ్రసర్వస్వ సంపాదకులు,
ఆర్యపురం, రాజమండ్రి.

,, భమిడిపాటి కామేశ్వరశాస్త్రిగారు,
శ్రీమద్వాల్మీకి రామాయణ గ్రంథమాలావ్యవస్థాపకులు,
ఆర్యపురం, రాజమండ్రి.

# సహాయులు.

—.o—

మ॥ రా॥ రా॥ శ్రీ. శేషనూరు కృష్ణమూర్తిగారు,
ప్రొద్దుటూరు.

,, జె. సుబ్బయ్యగారు,
ప్రొద్దుటూరు.

,, నామా వెంకటసుబ్బయ్యశ్రేష్ఠిగారు,
తెలుగు పోయట్,
ప్రొద్దుటూరు.

,, బి. వెంకటగురువయ్యశ్రేష్ఠిగారు,
జనరల్ మర్చెంటు.
నంద్యాల.

,, మునికోటి శ్రీనివాసరావుగారు. R. P. A.
ప్రొప్రైటర్, ది. వెల్కం ఫోటోమందిరము.
నంద్యాల.

శ్రీ.

# అంకితము.

చిన్నతనమునుండియు నా యభివృద్ధికై నిరంతరమనేక విధముల దోడ్పడుచు, నాకన్నివిధముల సుశిక్షణ మొసఁగి నాదరించుచుండు

గురుతుల్యులును,

చిత్తూరు జిల్లాబోర్డు, జిల్లా విద్యాసంఘముల కధ్యక్షులును,
చెన్నపురి చట్టనిర్మాణసభా సభ్యులును,
సంఘసంస్కరణోద్యమాభిమానులును,
ఆంధ్రమాతృ సుపుత్త్ర రత్నమునగు
శ్రీయుత, బొల్లిని మునిస్వామినాయుడుగారు, బి.ఎ.,బి.ఎల్.,
యం.యల్.సి. యఫ్-యం-యు.
వారియొక్క
దివ్యచరణములకు భక్తిమెయి
నీగ్రంథమును సమర్పించుచున్నాఁడను.

బూదూరు రామానుజులురెడ్డి.
గ్రంథకర్త.

శ్రీరామచంద్ర.

# అవతారిక.

—o—

గ్రంథరచన కిదియె నాప్రథమయత్నము. చిన్నటనుండి యు నాకు, మన హిందూదేశమునం దాదికాలమునుండియుఁ బ్రఖ్యాతి వహించియున్న యాంధ్రభాషయం దెక్కువ యభిమానముండుటచే, తదనుకరణములగు గ్రంథములను మిగుల శ్రద్ధవహించి చదువుచుంటిని.

అంతమాత్రముతోఁ దృప్తిఁజెందక, సంఘ[illegible] గ్రంథములను వారియుపన్యాసములును మిగుల [illegible] నఁ దిలకించుచు, ననేకసంఘ సంస్కరణ సభల కేగి[illegible], [illegible] నూతన విషయములు దెలిసికొనుచుండెడి వాఁడను. అటుల గొంతకాలము గడచినపిదపఁ బసితనముననుండియును, నాకు యేదేనియొక సాంఘిక గ్రంథమును రచింతమను కోర్కి జనించెను. నాయభిలాష కుపబలముగ నామిత్రులనేకులు నన్నం దులకుఁ బ్రోత్సహించుచుండిరి. నేనును నాయశక్తతను బాటింపక, శ్రీ శారదాంబపై భారమువైచి, కార్యోన్ముఖుడనై "రత్నాబాయి" యనునీచిన్ని గ్రంథమును వ్రాయుటకు బ్రారంభించి ముగించితిని.

ప్రస్తుతకాలమున నాంధ్రభాషయందుఁ గొన్ని సం[illegible] సంస్కరణోద్యమ గ్రంథములు ప్రకటింపఁబడియున్నవి, మ[illegible]

ప్రకటింపఁబడుచున్నవి. అందు మనభారతాంధ్ర దేశమునం దంతటను వ్యాపించి సంఘనాశము గావించుచుండు కన్యాశుల్క వరశుల్కముల గూర్చి వెల్లడింపబడియున్నవి. మరికొన్ని నితర దురాచారములగూర్చియు గ్రంథరూపమునను వ్యాసలేఖనముల మూలమునను ప్రకటింపఁబడుచున్నవి గాని, యట్టి యమూల్యములగు గ్రంథములఁజదివియు, జదువకయు మన దేశీయులా విషయముల నాచరణకుఁదేక, వెనుకంజవైచుచు మౌనముద్ర వహించుట మిగులశోచనీయముగ నున్నదనుట కెంతయుఁజింతింపదను.

మనుష్యుఁడు నిజకుటుంబ పోషణకై యెట్టి హీనవృత్తినైన నవలంబించి ధనమును సంపాదించి దారపుత్రాదులను బోషించుకొన వచ్చునుగాని, తానుగన్నబిడ్డలను విక్రయించుకొని యాధనమువలన జీవింపఁదలఁచుటకన్న పాపపుకృత్యము వేఱొండు లేదనియుఁ గన్యావిక్రేతలకును గోమాంసమునమ్ము కటికవారికిని భేదమించుకేనియు లేదనియు ధర్మశాస్త్రములు ఘోషించుచున్నవి. పురుషవేశ్యలపగిదిఁ గన్యలతోడ నైదువేలు బదివేలు, మోటార్లు, సైకిళ్లు, నిమ్మని యత్తమామల బాధించుచు వరశుల్కములవాతఁబడిన యువకులును గటికవానికి సాటియగువారే!

కటికవానికైన నొకప్పుడు కరుణయుండునుగాని, కన్యాశుల్క వరశుల్క పిశాచములుపట్టి శివమాడు స్త్రీపురుషుల



కేసుమంతయు నట్టిదయు గలుగకున్నది. ఇట్టి సంఘదురాచార కార్యములచే యున్నిసంఘములును క్షీణదశ నొందుచున్నవి.

మనవారెన్నియో "సంఘసంస్కరణ సభలని" చాటించి, వేదికలపైనెక్కి యుపన్యాసములిచ్చి యలసి సొలసి నిద్రించుచుండుటచే నీపిశాచములు మనదేశమునందింకను దలయెత్తి స్వేచ్ఛగాఁ దిరుగులాడుచునే యున్నవి.

సంఘ సంస్కరణాభిమానులును గ్రంథకర్తలును నగు మహాశయులు బయలుదేరి సంఘ సంస్కరణోద్యమ ప్రచారము విరివిగఁ గావించిననే, మన హిందూసంఘ మున్నతదశకు రాఁగలుగును లేదేని, దారిద్ర్యదేవతకు వశమగుటయే గాక, భారతదేశగౌరవమును సమితము దక్కించుకొనలేని వారమగుదుము.

ఔరా! వివాహసమయములందు వధూవరులనమ్ముకొను దుర్వ్యాపారము పవిత్రభూమియగు నీభారతావని సంచరించుచుంట యెంతయు శోచనీయము. దురాచారములకు సంబంధించినవై, చిత్రాతిచిత్రములును దుఃఖజనకములును మన కనులయెదుట జరుగుచున్నట్టివియు నగు నీశుల్కముల గాథలు పెక్కులు గల్గు అట్టివాని యందీకథ "కాయస్థ" వంశమున జరిగినట్లు వ్రాయఁబడియున్నది. భారతాంధ్ర దేశములందొక కాయస్థవంశమునందే యిట్టిదురాచారములున్నవని తలయూఁపక, ప్రతినాగర జాతియందును వేరుపురుగై సంచరించుచున్నదని పాఠక

మహాశయులు గ్రహింపవలయును.

ఈకథ కొంతవఱకు జరిగినదేయైనను మనదేశమందలి కన్యావిక్రేతలకును వరశుల్కప్రియులకును హితముగ నవుటకై కాలానుగుణముగ నందందు నేనుగల్పించి పెంచి నవలగా వ్రాసితిని. ఇది నా ప్రథమయత్నమని యిదివఱకే విన్నవించుకొనియుంటిని కాన, దీనియందుఁ దప్పులు పెక్కులుండవచ్చును. వానినిఁ బాటింపక యొప్పులనే గ్రహించెదరని గుణగ్రహణపారీణులగు పండితవర్యులఁ బ్రార్థించుచు నిందుఁగల ప్రమాదములను క్షమించి నాకుఁ దెలిపినచోఁ గృతజ్ఞుడనై ద్వితీయ ముద్రణమునందుఁ బొందుపఱచెదనని విన్నవించెదను.

వర్షత్రయము నాడీగ్రంథమును నేరడించియుండియు భాషాభిమానుల సాయము లేగ మూలఁబడియుండిన నా గ్రంథవిషయమెఱింగి అత్యంతాభిమానమున దీనిఁగోరి తమ గ్రంథమాలయందు బ్రకటించి నాకన్నివిధముల బ్రోత్సాహము గల్పించి సాహాయ్యపడిన వైశ్యకులతిలకమును ఆంధ్రభాషాపోషకులును కవులపాలిటి మందారమును, కర్నూలు మండలాంతర్గత మగు చాగలమఱ్ఱియందుండు శ్రీ బాలభారతీ గ్రంథనిలయాధ్యక్షులును, యువకశ్రేష్ఠులును నగు శ్రీయుత మదళ్లపల్లె రామసుబ్బయ్యశ్రేష్ఠిగారికి కృతజ్ఞతాపూర్వకముగ నావందనము లర్పించుటయె గాక శ్రియఃపతి వారికన్నివిధముల సర్వదా సాయపడుగాక యనికోరి ప్రార్థించుచున్నాడను.



ఈపొత్తమును శ్రద్ధతోఁ బరిశీలించి ప్రమాదములు లేక వ్యాకరణయుక్తముగా సవరించి గ్రంథరచనయందు నా కత్యంతోత్సాహమును గలుగఁజేసిన, కవిశిఖామణులును కోడూరులోని మిర్జాపాఠశాలయం దాంధ్రపండితులును నగు బ్ర|| శ్రీ|| వేదము వేంకటకృష్ణశర్మ గారికిని, ప్రేమపూర్వకముగ నా గ్రంథమును సాకల్యముగఁ జదివి తమకుగల పెక్కు కార్యములయందు వీలుగలిగించుకొని దయతో తొలిపలుకును వ్రాసి యిచ్చి నాగ్రంథమునకు వన్నెయు వాసియు గల్పించిన ఆంధ్రపత్రికాధిపులగు శ్రీయుత, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారికిని నేననేక వినయపూర్వక నమస్కారములాచరించుచున్నాఁడను. ఇందు నాస్వల్పజ్ఞానవశంబునఁ గలుగు దోషపరంపరల సహించి యాంధ్రుల [illegible]ము నన్ను మన్నించుగాక.

చివ్వేడ
చిత్తూరుమండలము.
11—5—1925

ఇట్లు, భాషాసేవకుఁడు
బూదూరు రామానుజులురెడ్డి.



# తొలిపలుకు.

వర్తమానయుగము పునర్నిర్మాణయుగము. సకలవ్యవస్థలును మార్పును గోరుచున్నవి. మానవకల్యాణమునకు మూలాధారములైన మత సాంఘిక ఆర్థిక రాజ్యాంగాది వ్యవస్థలు దుర్నయసంకలితములై సంస్కరణము నపేక్షించుచున్నవి. మోక్షసాధనములైన మతధర్మములు మూఢవిశ్వాసముల ఆలవాలములై బంధనమునకు సాధనములైనవి. ఇహపరసౌఖ్యములకు మూలములైన సాంఘికవ్యవస్థలు దురాచారసంకలితములై దుఃఖభాజనములైనవి. ధర్మారాధనమునకు సాధనములైన యార్థికవ్యవస్థలధర్మపరాయణములై పీడావిలసితములైనవి. యోగక్షేమములకు సాధనములైన రాజ్యాంగవ్యవస్థలు స్వార్థపరాయణములై, బీభత్ససంక్షోభములకు గారణములైనవి. ఇట్టి విషమపరిస్థితులందు సకలదేశములందును ప్రజాహృదయము ధర్మాభ్యుదయమును నిరీక్షించుచున్నది. ముఖ్యముగ నుదారాశయశోభితంబైన యువజనహృదయము సకలవ్యవస్థలయందును ధర్మసంస్థాపనమును జేయుటకు బూనుకొనుచున్నవిధమును ప్రపంచవృత్తి యనవరత విధములను విశదముచేయుచున్నది. స్వార్థపరాయణులైన ఘోరాచారప్రియు లెన్ని ప్రతిబంధకములను గల్పించినను నవి యంతరించి సత్యము ధర్మము విజయమును బడయుట ధ్రువము.



కలియుగమునందు ధర్మదేవతకు పదచ్యుతి గలిగి ధనదేవత ధర్మస్థానము నాక్రమించినది. మానవజీవితమునకు ధనార్జనము పరమావధి యైనది. విద్యకు వివాహమునకు మతమునకు సేవకు ధనము లక్ష్యమైనది. మహానుభావుడు భర్తృహరి వ్రాసినటులు సకలమును ధనము నాశ్రయించినది.

క. ఏనరునకు విత్తముగల
దానరుఁడు కులీనుఁ డధికుఁ డార్యుఁ డతండే
ధీనిధి ధన్యుఁడు శేవ్వరి
నానాగుణగణము కాంచనంబున నిలుచున్. — భర్తృహరి.

ధనపిశాచగ్రస్తములైన విషయములందు పవిత్రమైన వివాహధర్మమునకు బట్టినదుర్దశ పరమానర్థములకు గారణంబైనది. ఆంగ్లవిద్యావ్యామోహమీ దుర్దశాభ్యుదయమునకు దోడ్పడుచు వరశుల్కములు ప్రబలి సంసారములు కూలుచున్నవి. బాల్యవివాహములు వరశుల్కములు పవిత్రమైన వివాహధర్మమును పాడుచేసినవి. ఆడుపిల్లలు గలుగుటయె కెంగకు గారణంబైనది. వెండిచెంబులు పళ్లెము పట్టుపంచలు రూ 1116 లు సామాన్యమైన వరకట్నమైనది. పరీక్షలును స్థితిగతులును పెరిగినకొలది ఈమొత్తములను నెన్నియొరెట్లు పెంచి వరకట్నపు మొత్తము రూ 10,000 లను దాటుచుండును. వరకట్నములు ప్రాణమానధనములను నాశనము చేయుచు సంసారస్థితికే భంగమును గలుగజేయుచున్న విధమును శ్రీయుత బూదూరు రామానుజులురెడ్డిగారు రత్నాబాయియందు బాగుగ వర్ణించిరి.

రత్నాబాయి విషాదాంతము గల సాంఘిక నవల. రామకిశోరుడు కాయస్థవంశజుడు. తండ్రి చంద్రకిశోరుడు బాల్యమునందె పరలోకమును జేరెను. తల్లి తారాబాయియును తదనంతరము రోగపీడితయై కాలధర్మమును బొందెను. రామకిశోరుడు ప్రవేశపరీక్షయందుత్తీర్ణుడై పెండ్లియాడి యుద్యోగమును సంపాదించి సంసారయాత్రను జేయుచుండెను. కథానాయిక రత్నాబాయి రామకిశోరుని కుమార్తె. సుగుణసౌందర్యశోభిత యైన రత్నాబాయికి 13 ఏండ్లు నిండినవి. వివాహసమయ మాసన్నమైనది. ఎక్కడ సంబంధమును విచారించినను వేలకట్నమును గోరుచుండిరి. శ్యామసుందరుడను బి.ఏ. విద్యార్థి రూ 5000 కట్నమును గోరెను. తండ్రికి గలిగిన సంతాపమును సహింపజాలక రత్నాబాయి విషము దిని ప్రాణత్యాగమును జేసినది. రామకిశోరుని పుత్రుడు హరికిశోరుడు విద్యావంతుడై సంస్కరణసమాజములను స్థాపించి వరశుల్కములను రూపుమాపుటకు బూనుకొని జనకునకానందమును గలుగజేసెను.

ఆంగ్లవిద్యాప్రభావము వరశుల్కములకు ప్రోత్సాహము నొసంగుచు సంసారయాత్రను దురాశాధ్యము చేయుచున్నది. అసహాయోద్యమమును బ్రాహ్మణేతరోద్యమమును నాంగ్ల విద్యామూల్యమునకు న్యూనతను గల్గించినను వరశుల్కమూల్యము మాత్రము హెచ్చుచునేయున్నది. హరికిశోరుని యుపన్యాసరూపమునను రత్నాబాయి మరణరూపమునను గ్రంథమునందు వరశుల్కదురంతములు చక్కగను వర్ణింపబడినవి. ప్రకరణములందు గల పద్యములు భావపరిస్ఫుటమును జేయుచున్నవి. సందర్భానుసారముగను చేసిన వర్ణనలును వ్యక్తముచేసిన భావములును రామానుజులు రెడ్డిగారికి గల గాఢమైన దేశభాషాభిమానములను విశదము చేయుచున్నవి. కథానాయకుడైన రామకిశోరుడు గంభీర స్వభావము గలిగి యుండిన పాత్రపోషణమునకు వికాసము గలిగియుండును.



ఆంధ్రదేశమునందునయితము గల వరశుల్కదురంతరముల నాంధ్రలోకమునకు హృద్గతము చేయుటకు పాత్రలకును రంగములకును నాంధ్రనామరూపములను బెట్టిన ప్రయోజన మధికమై యుండియుండును. కథానుసంధానమునందు విచిత్రాంశములు లేకపోయినను సామాన్యవిషయములను పాఠకుల కభిరుచి గలుగునటులు చేర్చి గ్రంథకర్త నిర్మాణకౌశలమును వ్యక్తముచేసెను. శ్రీయుత ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు మాలపల్లెయందు సంఘజీవనము నత్యద్భుతముగ వ్యక్తముచేసి సేవాసాధనమును విశదముచేసిరి. గ్రంథకర్తలు సామాన్యములైన సాంఘికవిషయములను వారి రచనలకు విషయములనుగ గ్రహించుట వర్తమానపరిస్థితులందు ప్రయోజనకరము. యువజను లీమార్గము నవలంబించి వారి రచనాప్రవాహములను నవజీవనోజ్జీవనమునకు వినియోగించి శ్రేయస్కాము లగుదురుగాక!

గ్రంథకర్తకును నాకును గల చిరకాలపరిచయమును వారి దేశభాషాభిమానములును నాపరిచయవాక్యములకు గారణములు. పండితులు లోపములను మన్నించి గుణములను గ్రహింతురుగాక! రత్నాబాయి ఆంధ్రుల యాదరణమునకును భగవదనుగ్రహమునకును బాత్రమై గ్రంథకర్త సంకల్పము సఫలమగుగాక!

క్రోధన ఆషాఢ శు ౧౨<br>శుక్రవారము, మదరాసు. } కా. నాగేశ్వరరావు

శ్రీ

# రత్నాబాయి.

## మొదటి ప్రకరణము.

—o—

"భారతమాత"! నీసుతులు-భవ్యపథాను చరిష్ణులయ్యు, నా
చారములంచుశుల్కములఁ-జాలగ్రహించుచుఁ బెండ్లివేళలన్
గ్రూరమతిన్ జరింపఁ, గనుఁ-గొంచునునుండుట నీకుఁ బాడిగా
దారయ, నట్టినీచులకు-నాదరమొప్పఁగఁ దెల్పు: 'దుర్మనా
చారములెల్లమానుఁ'డని-సద్యశమందెద వెప్పుడమ్మరో!

మాధవపాద సముద్భూతయై, కలుషవిధ్వంసినియై, యు
భంగాభ్రఘోత్తుంగ తరంగయై, మర్మరధ్వాన నర్మాలాపంబు
లాడుచు, నిజనాథుఁడగు నదీశుచెంతకుఁ జూడ్కులకు వేడ్క
నింపు మంద మందగమనంబులఁ బోవుచున్నదో యనఁ బ్రవహిం
చుచుండు గంగా స్రవంతినీ తీరంబున 'రంగాపూర'ను పురం
బొండుగలదు. అయ్యది యంత పెద్ద పట్టణముఁ గాకున్నను సౌం
దర్యమునకు నెలవని, చిరతరఖ్యాతినంది మిగుల నొప్పారుచుం
డు. ఆ నగరమందు 'శ్రీధర్' అను నొక సుప్రసిద్ధమగు వీధికిఁ
జిట్టచివరఁ బూరింట్లొకటి వెలయుచుండు. ఆ గృహముంగాచి

న సామాన్య గృహస్థులెవరో యందు వాసము సేయుచున్న
టులు దోఁచును. కాని యీ యింటిముంగిట నవనవ సౌరభముల
వెదచల్లు నానావిధ పుష్ప గుచ్ఛములతోఁ బ్రకాశించుచుఁ
దొట్లలోనిడియు, భూమిపై నాటఁబడి పెంపబడుచుండిన వృక్ష
పంక్తులను లతాగుల్మ సముదాయములను గలిగి నేత్రోత్సవ
ముం బొనరించు విహారోద్యాన వనముం దిలకించిన ధనికుల
మందిరంబులపై సయితమేవగింపు వొడము ననుట యతిశయోక్తి
గానేరదు.

ఒకానొకనాఁటిరాత్రి యీ యింటనొక గదియందుఁ
బదునాఱువత్సరముల ప్రాయము వాఁడు వింటిదబ్బల నిరసించు
కనుబొమలు గలవాఁడు-విశాల ఫాలప్రదేశముచే నొప్పులొలు
కువాఁడు-నూనూఁగు మీసములవాఁడు-కెంజిగురు లహసించు
సునుమోవికి వింతకాంతి నొసంగుచు నవ్వకయే నవ్వినట్లుండు
సుందర వదనారవిందము వాఁడు యువకుఁడొకఁడు గూరుచుండి
యేదియో దీర్ఘముగా నాలోచనము సేయుచుండెను నిశ్శబ్దమ
గు నా గదిలో నాతని యింద్రియముల నాకర్షించు నవేవియు
లేకున్నను నెదుట దృగ్గోచరమగుచు, గాజుకుప్పెలో వెలుఁగు
చుండు దీపియ యొక్క కాంతియును, ఘ్రాణేంద్రియముం దని
యించుచు నెంతయు హాయిఁ గూర్చుచుండు గృహబహిర్వన
పుష్పసౌరభమును నాతని హృదయమును జలింపఁజేయఁ జాల



వయ్యెను. అతనిదృష్టి దీపకాంతులపై లేదు-అతని ఘ్రాణేం
ద్రియమా సుమసుగంధములపై లేదు-అతని చిత్తమాతనిలో
లేదు-అంతయు భ్రమ-కాదుకాదు-దీర్ఘచింతనము. అతఁడేది
యో దీర్ఘముగ నాలోచించుచుండెను. అట్లుండుటకుఁ గారణ
మెద్దియో, యాతఁడెవ్వఁడో మనమెఱుంగుటావశ్యకము.

సచ్ఛీలురని పొగడ్తఁగన్న కాయస్థ వంశస్థులలోని వాఁ
డగు నాయువకుని పేరు రామకిశోరుఁడు. బాల్యముననే తనజన
కుఁడు దివికేగుటచే, నన్యాధారములేక, తనతల్లి యండనే పె
రుఁగుచుండుటవలన నాతఁడు తన భావిస్థితిం గూర్చియే, యి
ప్పుడుఁ దలపోయుచున్నాఁడు. అతని పూర్వికులొక సంస్థానము
నందు 'దివాన్ పేష్కారు హోదాల' యందుండి లక్ష్మీకటా
క్షాంశ సంభూతులై యలరుచుండిరి. పూర్వులార్జించిన యాస్తి
రామకిశోరుని కాలము నాఁటికి నంతర్ధాన మగుటచేతనో దారి
ద్ర్యదేవత యాతని నాశ్రయించుటచేతనో పెద్దలు వహించి
యుండిన పదవి సహితమాతనికి లభ్యపడదయ్యె. పాపమా రా
మకిశోరుఁడు తనతండ్రియగు చంద్రకిశోరుఁడు పరలోకగతుఁ
డగు నాఁటికిఁ బదిసంవత్సరముల యీడుఁగల బాలుఁడు మన
కథాకాలమునాఁటి కాతఁడు రంగపూరునందలి హైందవకళా
శాలయందు (Fifth form)అయిదవఫారముఁ జదువుచుండెను.
సంస్కృతమునందును, మాతృభాషయగు హిందీయందును,

నాతనికి, జక్కని యభిమాన ముండుటచే, నారెండు భాషల
యందును ప్రావీణ్యము సంపాదించుచుండెను. రామకిశోరుఁడు
సద్గుణరాశియు, విద్యాభిలాషియు నగుటచేతఁ దాఁబట్టినపట్టు
వదలక, తల్లిమాట జవదాఁటక కళాశాలలో శ్రద్ధగాఁ జదువు
కొనుచుండెను. ఆతనితల్లియగు తారాబాయియు భర్త మృతి
నొంది నందులకు శోకనిమగ్నయై యుండినను సుపుత్రరత్న
మగు రామకిశోరుఁడు దన్నుద్ధరింపఁగలఁడను ధైర్యముతోడను
నమ్మకముతోడను నాతనివిద్యాభివృద్ధికి వలయు ద్రవ్యసహాయ
మును జేయుచు, నాతని యభివృద్ధి కనవరతమును శ్రమపడు
చుండెను. లక్షల కొలఁది ధనము లేకున్నను, నివసించుటకొక
చక్కని చిన్నగృహము. సుమారైదువేల రూప్యములు మాత్ర
ము చంద్రకిశోరుఁడు వీరిజీవనార్థమై వదలి దివంగతుఁడయ్యెను.
అన్యవిధమగు నార్జనములేక యింటఁ గూరుచుండి భుజించుచు
వచ్చిన నీధనమెన్నాళ్లునిలువఁగలదు! ప్రతిదిన మొక్కొక్కశిలఁ
దీసివైచుచుండినఁ బర్వతమైనను గొన్నాళ్లలో నేలమట్ట మగు
నుగదా!

చంద్రకిశోరుని యంత్యక్రియలకించుమించుగ సహస్ర
రూప్యములు వ్యయమైనవి. తనసరివారిలో గౌరవలోపము గ
లుగుననియు. భర్తకు ముక్తిమార్గము చేకూరవలయు ననియు
ముందువెనుకయాలోచింపక తారాబాయి యారీతి నున్నడబ్బు





ను విచ్చలవిడిగ వ్యయపెట్టుట ప్రమాదమే.

ఔరా! తాను బేదఱికమును నిత్యభూషణముగఁ గలిగి
న హిందూసంఘమిట్టి సంస్థలలోఁ దనత్యాగబుద్ధిని గనఁబఱ
చుచు విఱ్ఱవీఁగుచున్నదిగదా! విధివిహితములని, శాస్త్రసమ్మత
ములని, యార్యసంస్తవ్యమని శక్తికిమించిన కార్యమును నెత్తి
పైఁబెట్టుకొనిన సంఘమిప్పటికిని నభివృద్ధికి రాకపోవుటయకాక
మీఁదుమిక్కిలి దురవస్థలపాలగును. దరిద్రదశనందును. ఆఱు
కోట్లజను 'లన్నమో రామచంద్రా' యని మొఱలిడుచుండు నీ
దరిద్రదేశమున ధనవంతులమని జమీందారులమని నిక్కువారు
వివాహసమయములయందును, గర్మక్రతువులయందును గన్ను
మిన్నుఁ దెలియక విచ్చలవిడిగ ద్రవ్యమును దుర్వినియోగముఁ
జేయుటకంటెఁ ద్రాగుటకొక పూఁటకైన నరకడుపుకైన గంజి
లేని తోడిసోదరుల నుద్ధరించుట కుపయోగింపరాదా? భోగము
మేళములకుఁగొంత-అధికారుల విందులకుఁగొంత-కన్యాదక్షి
ణలకుఁగొంత-వరశుల్కములకుఁగొంత-యీరీతి దురాచారకా
ర్యములకు వెచ్చించి, భార్యా పుత్రుల తోడను దారిద్ర్యదేవికి
దాసులగుటకు సిద్ధపడుదురుగాని మనస్ఫూర్తిగ సంఘోద్ధరణ
మునకో-విద్యాభివృద్ధికో-యనాథశరణాలయములకో-కించిత్తై
నను సాయముఁ జేయు లేరుగదా! అహా! కాలమహాత్మ్యము!

---o---

శ్రీ.

# రత్నాబాయి.

## రెండవప్రకరణము

—o—

భర్తృవియోగ శోకమును హృద్రోగమునకుఁ దోడు తారాబాయికి దేహపాటవము సయితము నానాఁటికిఁదగ్గుచు వచ్చెను. నూతనరాజయొకటి యామెశరీరము నాశ్రయించెను. దినక్రమమున నయ్యది యభివృద్ధిఁ జెందుచుండుటచే లేచుటకుఁగూడ నామెకు శక్తి చాలక పడకఁబట్టెను . అందుచే రామకిశోరునికి నన్నము వండి పెట్టుటకుఁగూడ దిక్కులేనిస్థితి సంప్రాప్తించెను, రోగియగు తనతల్లికిఁ బథ్యపానాదులు సకాలమునకుఁ దయారుచేసి యిచ్చుటకుఁ దనకుఁ బాఠశాలనిర్బంధముచే సాధ్యముకాలేదు, కావున మాసమున కైదురూపాయలచొప్పున వేతనము నేర్పఱచి వంటలవ్వ నొకతెను నియమించుకొనక తప్పినదికాదు. అయవ్వయు రోగికిని, రామకిశోరునకును నన్నపానాదులమర్చి పెట్టుచుండెను. రామకిశోరుఁడు గృహకృత్యములెల్లఁ జక్కఁబెట్టుకొనుచు, వేళకుసరిగాఁ గళాశాలకరుగుచుఁ, దనతల్లి యారోగ్యస్థితి నేమఱక నిరంతర మరయుచుండెను



ఇంతలో సంవత్సరాంత్యపుఁ బరీక్షలును నాతనికి సమీపించుచుండెను. తనతల్లికి సంభవించినరోగమా-యేనిమిషమునకానిమిషమ్ము ప్రబలుచునేయుండెను. తనకు సమీప బంధువులా-లేరైరి, ఇట్టిస్థితిలోఁ బాపమాతఁ డొక్కఁడేమి సేయఁగలఁడు! 'ఈసారి పరీక్షలో నేను త్తీర్ణుడనై పైతరగతికిఁ బోఁగలనా! నాతల్లి దేహస్థితి యెన్నఁటికైన నారోగ్యదశకువచ్చునా!!' యని యనవరతము రామకిశోరుఁడు చింతింపసాగెను. కాని యాతని కోర్కెలీడేరునట్లు లేదు కాబోలు! పరమేశ్వరుని కరుణాకటాక్షము లాతనిపైఁ బ్రసరించుట కింకను దగినవాసన్నము కాలేదు, కావుననే తారాబాయికి నన్నహితవుకూడఁ దప్పుచుండెను. కంఠస్వరముకూడహీనస్థితికి వచ్చుచుండెను లేచికూర్చుండుటకు సయితము శక్తిలేకుండఁ బోవుచుండెను. అక్కటా! రామకిశోరుని విచారమునకిప్పుడు మేరలేకుండెను. అయూరఁ దనతల్లి జాడ్యమును గుదుర్పఁజాలిన భిషగ్వరుఁ డెవ్వఁడాయని యాతఁడాలోచింపఁజొచ్చెను వైద్యశాస్త్రరీతిని రోగమును గ్రహించి యౌషధమీఁజాలిన వైద్యుఁడుగాని.-యొకవేళ నట్టివాఁడేయుండిన నత్యంత ధనాతురుఁడుఁ గానివాఁడుఁగాని యాతని తలంపునకు రాలేదు. కావున నెట్లైనఁ దనజనని దేహస్థితి చక్కఁబడుటయే యాతని యుద్దేశమగుటచే వైద్యనామధారులగు ప్రాణాంతకులచేతఁ దనతల్లికిఁ జికిత్ససేయనిచ్చగింపక, నా

యూర సుప్రసిద్ధవైద్య శిఖామణియని పేరొందిన డాక్టరు రఘునాథరాయిగారి నెట్లయిన బతిమాలుకొని తవతల్లి కౌషధమిప్పింపవలయునని నిశ్చయించుకొనెను.

గీ॥ అతులితానందమునకుని-మ్మైనవయును
అనమసౌఖ్యంబులకు నెల-వైనవయును,
చిఱుతవయు, సట్టివయసున-జెపురాని
కష్టములు ప్రాప్తమైనదుః-ఖంబకాదె॥

—o—



శ్రీ

# రత్నాబాయి.

## మూడవ ప్రకరణము

—o—

రంగపూరు నందలి రాజవీథి యతివిశాలమై యిరుపార్శ్వముల ధనికులయొక్కయు, నుద్యోగస్థులయొక్కయు, దివ్యభవనముల చేత నతి రమణీయముగఁ గానంబడును. అందొక సుందరమందిరము మూఁడంతస్థులు గలిగి శృంగారంబునఁ దక్కినవానిం దలఁదన్ను నట్లుండెను. రామకిశోరుఁ డొకనాఁటి యుదయమున నీగృహముకడ కఱుదెంచి బయట వసారాలోఁ బచారు సలుపుచుండు పురుషుం గాంచి 'అయ్యా! డాక్టరుగారున్నారా?' యని ప్రశ్నింప 'నున్నారు, మేడపైనున్నారు. మీరేఁగి వారిని దర్శింపవచ్చు' నని యాతఁడనఁగ రామకిశోరుఁడు నున సంభ్రమముగ సోపానముల నెక్కి రెండవయంతస్థు మేడమీఁదికరిగెను. అటనొకపడక కుర్చీపైఁ గూరుచుండి, వార్తాపత్రికలు నొకదానిని జూచుచు, నడుమ నడుమ నోటిగుండఁ బీల్వఁబడు పొగచుట్టయొక్క ధూమమును నాసికా రంధ్రములగుండ వదలుచుండు నొకపాశ్చాత్య నాగరకతా వ్యామోహనిమగ్నుఁడగు స్థూలకాయు నొకనిం గాంచి దూరముగ దీనవదనముతో నిలువంబడెను. రామకిశోరుఁడట్లు పదిపదునైదు నిముసములవఱకా డాక్టరుగారి ముఖారవిందముపైఁ జూడ్కులు నిగుడ్చుచు ని

లుచుండినను, రఘునాథరాయిగా రాతనివంకఁ జూడలేదు. తు
దకుఁదన నోటిలోని పొగచుట్టఁ బీల్చుట పూర్తియగుటచేత
నూతన ధూమచ్ఛదకణికం గైకొనుటకో-మఱియెందులకోగా
ని వార్తాపత్రిక నాతఁడు సమీపమునందు బల్లపైనుంచి నలు
దిక్కులఁ జూడ్కులుసారించుచు లేచెను. అప్పుడు రామకిశోరుఁ
డాతని కంటఁబడక తప్పదయ్యెను. రామకిశోరుఁడును డాక్టరు
గారు తన్నుఁ జూచుటతోడనే వినయముతో వందనమాచరిం
చెను. అప్పుడు డాక్టరుగారు రామకిశోరుని దప్పక కనుంగొని
'అయ్యా! మీదేమూరు!'

రామ—'అయ్యా! నేనీయూరనే నివసించు నొకనిరాధా
రుఁడను'

డాక్ట—'అయిననిప్పుడేమి కార్యార్థమై నాయొద్దకేతెంచితిరి'

రామ—'మహాత్మా చిఱుతప్రాయముననే తండ్రిని గో
ల్పోయిన నిర్భాగ్యుఁడనగు నాకుఁ బ్రస్తుతము నాతల్లిదప్ప
దిక్కెవరునులేరు. మేము నిఱుపేదలమగుటచే నెట్లో యీన
గరమందుఁ గాలముఁగడుపుచున్నారము. నేనిచ్చట హైందవక
ళాశాలయం దాంగ్లభాష నభ్యసించుచున్నాను.'

డాక్ట—'అవును. ఉండవచ్చును. కాని యవి యున్నియు నిచ్చ
టఁజదువనేల' నీవిప్పుడిచ్చటికి వచ్చినకార్యమేదో చెప్పుము..'

రామ—'దయామయా! ధన్వంతరితుల్యుండవగు నీకటాక్ష



మునాపైఁ బ్రసరించునేని నేనెంతయు ధన్యుఁడనయ్యెదను. బా
ల్యముననే జనకుఁ గోల్పోసి, తదాదిగఁ దల్లి యొక్కతెయే యా
ధార భూతురాలను నన్నొకయుతో నున్న నాకు దురంత చింత
యొకటి సంప్రాప్తమాయెను. అయ్యది తను సాయముచేఁ దీఱ
వలసి యున్నది'

డాక్ట—'మీయింట నెవరికైన జబ్బుగా నున్నదా యేమి!

రామ—'అవును మహాత్మా! మజ్జనని నేఁటికిరువది దినము
లుగ రుగ్మతచే శుష్కించి మంచముఁ బట్టియున్నది. లేవలేనంత
టియశక్తిచేఁ బరితపించుచున్నది. కాన వైద్యవిద్యయం దాఱి
తేఱి, యీనగరమం దెందఱో రోగుల ప్రాణములు రక్షించిన
మహానుభావులరగు మీరు మాయింటికేతెంచి నాజనని రోగ
మును గుదిర్చి నా కాధారముఁ గల్పించి రక్షింప, బ్రార్థించు
చున్నాను.

డాక్ట—సరియే. తప్పక కుదుర్పఁగలను. కట్న [Fees] మెం
తయిచ్చెదవు!

రామ—మహాశయా! బీదవాఁడను. విద్యార్థిని. ఇతరాధా
రము లేవియు లేనివాఁడను. నాతల్లియే నాకుదిక్కు. నేనుమీ
కేమి కట్నమియ్యగలను! ఎన్నిరూప్యము లియ్యఁగలను! దయ
యుంచి యుచితముగ నౌషధమిప్పింతురేని సర్వదా కృతజ్ఞుఁడ
నై యుండెదను.

డాక్టరు—సరి. బాగున్నది డాక్టర్లును, వకీళ్లును వచ్చువారి దీనాలాపములు వినుచు వారినుద్ధరించుటకు దయాదాక్షిణ్యములతోఁ బనిచేయ మొదలుపెట్టిన వారికి వృత్తులేయుండవు. కావున నీవెంత దీనముగఁ బల్కినను నధమపక్ష మయిదువందల రూపాయలైన నీవీయలేకున్న నేనేమియుఁ జేయఁజాలను.

రామకిశోరుఁడట్టె నిర్విణ్ణుఁడయి పోయెను. అతని మానసదుఃఖము, భయము, ఆశ్చర్యము, అశక్తత వెల్లడియగుచుండెను. నిజమే అతఁడయిదువందల రూప్యములెట్లువెదుక్కొని యిడఁగోఁ గుద్దింపఁగలఁడు? పెద్దలార్జించిన యాస్తియా-కడుస్వల్పము. తనసంపాదనాశక్తియా-యింకను విస్తృతయుండే యున్నది. ఇట్టిస్థితిలో నాతఁడేమి చేయఁగలఁడు? 'అయినను గానిమ్మనియు, నెట్లయినఁ దనతల్లి స్వస్థతంజెందిన, యింటనుండి నను నంతియే చాలుననియు మనమునఁ దలపోసెను.

కాని 'కడపటి ప్రయత్నముగ నొకపరి డాక్టరును బ్రార్థించి చూతు'మని యాతని చిత్తము రాయుంజూచి, దీనవాక్కులతో

'ఆర్యా! అయినను చిత .... .... .... ....' అర్ధోక్తిలోనే డాక్టరుగారు 'ఇఁక మాటలాడకుము. ఐదువందల రూపాయల కొక్కటితక్కువ యైనను నొప్పుకొనను. ఇంతదూరము వేఁడుకొంటివని స్వల్పమొత్తమున కంగీకరింపవలసి వచ్చెఁగాని, మఱియొకరి విషయమునైనచోఁ బూర్తిగ వేయిరూప్యము





లడిగియేయుందును. ఔచిత్యమెఱుఁగక యూరకమాటలాడిన నేమిలాభము? నేనడిగిన మొత్తమిచ్చుటకు సమ్మతించునెడల వచ్చి నీతల్లిని బరీక్షింపఁగలను. అంతేఁ దక్కినగనో-యుచితముగనో వ్యాధిని మాపుమాపవలయునన్న, నట్టి వారియొద్దకే నీవరుగుము. పలుమాటలేల!'

డాక్టరుగారి మాటలు విన విధవ రామకిశోరుని నోటినుండి 'ఐదువందల రూప్యము లిచ్చెదను మహాశయా' యను వాక్యములకంటె నింక నేమియు బయలువెడలలేదు.

తక్షణమే డాక్టరు రఘునాథరాయి యానందహృదయులై యద్దానిని బహిర్గతముగానీక చరచర నొక గదిలోనికేఁగి యంగీని, నుష్ణీషమును ధరించి హృదయధ్వనుల బరీక్షించుశ్వాసకోశ పరీక్షాపాశబంధము సాధనము [ Stethoseope] ను మెడలో వేసికొనవైచుకొని కొన్నియౌషధములుగల గాజుసీసాలను యొకపెట్టియలోఁబెట్టికొని, సేవకునొకనిఁ బిలిచి యాపెట్టె నాతనిచేతికిచ్చి, వానివెంబడి తానును, రామకిశోరుఁడును గ్రిందికివచ్చి, గుమ్మముకడ సిద్ధముగనుండు మోటారుబండినెక్కి 'శ్రీధర్' వీధినిగూర్చి 'బుజ్జున' బండిని బోనిచ్చిరి.

గీ॥ ధనభిమగర్వమ్ముఁ దనలంచు_గర్వపడక
యమితధనకాంక్షితుండయి-యపరిపక్వ
సర్వసౌభ్రాతృభావంబు-జాలవిడక
వఱలుచుండెను నాఁడెపో-వైద్యుఁడవని!

శ్రీ

# రత్నాబాయి.

## నాలవ ప్రకరణము.

—o—

తారాబాయి యారెలుఁగుతో మూల్గుచు మంచము
పైఁ బరుండియుండెను. రామకిశోరుఁడును డాక్టరుతోఁగూడ
నామెను సమీపింపఁగనే యామె కనులవిప్పి వారివంక దృష్టు
లఁబఱపి మరల నయనములు మూసుకొనెను. ఇంతలో వంట
లవ్వను రామకిశోరుఁడు పిలిచి, యామెయుఁ దానును, తారా
బాయిని యిరువంకలఁబట్టుకొని లేపి కూరుచుండఁబెట్టిరి. డాక్టరు
రోగిని బరీక్షించి మరలఁ బకంఠఁగొట్టించి[Stethoscope]తో
మఱియొక మారామె దేహస్థితిని బరిశీలించి చూచి, యొక చి
త్తుకాగితముపైఁ దాను దెలిసికొనిన రోగగుణములను వ్రాసి
కొనెను. తరువాత రోగిని నారోగ్యకరమగు ప్రదేశమునఁ బ
రుండఁబెట్టుమనియు, గంజికాఁచి త్రాగింపుమనియు రామకిశో
రునితోఁ జెప్పి తాఁదెచ్చిన రెండుమూఁడు సీసాలలోని యౌష
ధములను నొకటిగా మిశ్రముఁజేసి యందొకభాగ మారోగి
నోటిలోఁ బోసెను. తెలివిఁగలిగిన యా వ్యాధిగ్రస్తురాలును



స్వస్థతఁ జెందఁగలనుగదా!' యను సన్నకముతో వైద్యుఁడో
వంగిన యామధమును గొంచెము గొంచెముగ మిగ్రిగిప్పెను.

వెంటనే డాక్టరు తనకట్నపుఁ బైకమిమ్మని రామకిశో
రునడిగెను. అతఁడును మఱుమాటాడక 'తనజననికారోగ్య
ము గలుగునుగదా!' యను సంపూర్ణవిశ్వాసముతో రెండువం
దల యేబదిరూపాయలు డాక్టరుచేతికిచ్చెను, రాయిగారామొ
త్తమును లెక్కించుకొని 'తక్కిన పైకమెక్కడ'? నని యడిగెను.

రామ—దయామయా వైద్యశేఖరా! రేపు మిగతిపైకమి
చ్చెద ఇప్పటికివ్వఁజాల నందులకు క్షమింపుము.

డాక్ట—(అసూయతోఁ గనుఁబఱచుచు) ఏమీ! రేపిచ్చెదవా?
కూరగాయల బేరములవంటివేమి?

రామ—లేదార్యా! ఇప్పుడునాయొద్ద ద్రవ్యము సిద్ధముగ
లేదు

డాక్ట—అట్లయిన రేపు రెండుగంటలకు సరికి నేవచ్చెదం
తును. అపుడుపైకమిచ్చిన రోగిని బరీక్షింతునని చెప్పుచు డా
క్టరుగారు వెళ్ళిరి.

పాపము రామకిశోరుఁ డానాఁటి మధ్యాహ్నమునుండి
యే కళాశాలకుఁ బోవుట కత్యంతరము గలిగెను. ఏలయన,
ఔషధము పుచ్చుకొనినది మొదలారోగ్య దశకురావలసిన
తారాబాయి దేహస్థితి యింకను గాఢముగ వ్యాధి పీడితమగు

చుండెను. కావున రామకిశోరుఁడు కళాశాలకేఁగుటమాని తన
తల్లియొద్దనేయుండి యామెకువలయు సౌకర్యము లమర్చుచుం
డెను. ఎల్లలప్పు డప్పుడే కాఁచి తెచ్చిన గంజి నిచ్చుటకు మూ
ల్గుచు నిదురించుచున్న తనతల్లిని లేపెను, కాని యామె కనులు
విప్పి, రామకిశోరుని మోమునంకఁ జూచి యూరకుండెను. లేచు
టకామెకుఁ దగినశక్తి లేదు. అందుచే రామకిశోరుఁడే కంటఁద
డిపెట్టుచు, వంటలన్నపానముతోఁ దారాబాయినిమెల్లగఁ గూ
ర్చుండునట్లుజేసి. గంజిని ద్రాపెను. రెండుగ్రుక్కలు గ్రం
గుసరి కాయమకాయాసము బలమగుటచే మరల యథాపూ
ర్వముగఁ బరుండఁబెట్టిరి ఆరాత్రిగడచినది. తారాబాయి దే
హస్థితి యేనిమిషమునకాని విషము సందేహాస్పదముగ నుండ
టంజేసి రామకిశోరుఁ డారేయియంతయు మేలుకొని యుండవ
లసివచ్చెను. రామకిశోరుని హృదయపద్మమునుండి నిజజనని దే
హారోగ్యముం గూర్చినయా శాపరిమళములు వెలికివచ్చు చుం
డెనోయనునట్లు లోకబాంధవుని కిరణసమూహము బయల్వె
డలుచుండెను ఉదయమాయెను. డాక్టరుగా రెప్పుడరుదెంతు
రా! యని చింతించుచుఁ దనతల్లికి ముందుదినము డాక్టరుగారి
చ్చిన యౌషధమునిచ్చి యాయమకుఁ బథ్యపానములు చూచు
కొనుచు నా దినమునయితము కళాశాలకరుగక రామకిశోరుఁ
డింటనే యుండెను. మధ్యాహ్నము పండ్రెండు గంటలగు సరికి





రామకిశోరునికి మిక్కుటముగ సంశయము గలిగెను. కావున
వెంటనె యాతఁ డత్యంత సంభ్రమముతో డాక్టరుగారి యింటి
కేఁగి యాతనికిఁ దన తల్లిగారి దేహస్థితిని నివేదించి శీఘ్రము
గఁ దనతల్లిని జూచుటకు రమ్మని వేఁడుకొనెను, కాని యాతఁ
డు తనకు నాఁటిదినము చాలపనులున్నవనియుఁ గావున నొకటో
కగంటలో వత్తుననియు నంతలోఁ దనకియ్యవలసిన రెండువం
దల యేఁబదిరూప్యములను జాగ్రత్తచేసి పెట్టవలయుననియుఁ
జెప్పి రామకిశోరుని బంపివైచెను. ఇఁకఁ జేయునదిలేక, డాక్టరు
గారి నిర్దయాపరత్వమునకు వగచుచుఁ, తనతల్లిస్థితికిఁ జింతించు
చు, 'నట్లయిన నాతల్లిని బ్రతికించు భారము నీయది' యని భ
గవంతునిఁ దలఁచుకొనుచు నిలుసేరి డాక్టరుగారి రాకకు నిరీక్షిం
చుచుండెను ఇంతలో రెండుగంటలైనది. మోటారుబండి బు
ఱ్ఱున రామకిశోరుని యింటిగుమ్మము కడకువచ్చి నిలిచెను. ఉ
త్తరక్షణముననె డాక్టరురాయిగారు బండిదిగి లోనికివచ్చుచుం
డుటను రామకిశోరుఁడు గ్రహించి, యాతని నెదుర్కొనెను. డా
క్టరుగా రామెనుం జూచుటతోడనే 'మిగతపైకమెక్కడ' నని యడు
గెను. 'ఇదె యియ్యగలను. ముందు రోగింజూడఁ బ్రార్థించెద'
నని యెంతదీనముగఁ బల్కినను రామకిశోరునిమాట లాతనియె
డనూషరక్షేత్రమునఁ జల్లినబీజములవడువున వృథయగుటచే,
రెండువందల యేఁబదిరూప్యము లప్పుడే తెచ్చి యివ్వవలసివచ్చె

ను. చూచితిరా! మనదేశ భిషగ్వరుల కారుణ్యస్వభావము పా
పము! రామకోటరువంతటితో డాక్టరుగారు వదలిపెట్టిరా! లే
దు. లేదు, అతఁడిచ్చిన పైక మౌషధక్రయమునకే కొఱఁతపడు
చున్నదనియు, నయినను దానెట్లో యుపాయములకు సన్నాహించితిన
నియుఁ, దాను రామకోటరునింటికి వచ్చి రోగినిబరీక్షించినందు
లకు దినమొకటి కైదురూప్యములవంతునను బండిబాడుగలు
పదిరూప్యములును మొత్తమిరువది రూపాయలును నిమ్మల్న
షుఁడగు రామకోటగురి యొద్దనుండి పుచ్చుకొనక వదలినవాఁడు
కాఁడు, అట్లాతఁడు దన ప్రావీణ్యమంతయు రోగము మానఁదీ
యుటలో గనఁబఱుపకున్నను, ధనము లాగుటలోఁ బూర్తిగఁ
జూపి, రోగినోటఁ గొంతయౌషధమును గుప్పరించి, రామకో
టరునిచేత నోటసినాఁబెట్టి 'రేపటి యుదయమున కంతయుని
వ్నాలించు' ననియు. 'నిప్పుడిచ్చిన యౌషధ మైపోయినచో నా
రెయుకు వచ్చిననిచ్చెద' ననియుఁ జెప్పివెళ్లెను. ఔరా! మనభి
షగ్వరుల స్వార్థత్యాగము! పరార్థ ప్రాణహరణానురాగము!!

పాఠకులారా! ఒకచిన్నమనవి. పరోపకారమునకు మిం
చిన ధర్మములేదనియు, స్వార్థత్యాగమునకు మించిన దేశసేవ
లేదనియు, గంభీరస్వనముతో నుపన్యాస పీఠములెక్కి దీర్ఘోప
న్యాసము లీయవచ్చును. మంచి యుపన్యాసకుఁ డనిపించుకొన
వచ్చును. కాని సమయమువచ్చినప్పుడు 'వెన్నలోపడుగు' వేయు





వారెందఱోగలరు. మానవసేవ మహోత్కృష్టధర్మమని బోధిం
చిన మహావక్తలు నయితమొక్కొక్కపరి తమదేశసోదరుల క
ష్టముల గమనింపరు. మానవప్రేమ సర్వసౌఖ్యప్రదమని బోధిం
చు పౌరాణికాగ్రేసరులు గూడఁ దద్విషయమున నాపద వ
చ్చినపుడు మార్గ్నగము పెట్టుచున్నారు. బ్రాహ్మణులకిచ్చు
దానములు మోక్షదాయకములని చాటుగ్రాం పౌరోహిత్యుఁ
డు సహితము దానిట్లు ప్రవర్తింపఁడు. ప్రజల నిజముగ నుద్ధరిం
చు బుద్ధిఁగలిగినవాఁడే తానుదన ప్రవర్తనను దిద్దుకొనఁజాలఁ
డు. కారణమేమి? చేయుటకుండఁ జెప్పుటసులభముగదా. ధర్మ
స్వరూపులును, గేవలాధ్యాత్మిక స్వతంత్రులునగు దేశోద్ధార
కులు, పౌరాణికోత్తములు, పౌరోహిత శిఖామణులు మొదల
గువారే యాత్మసుఖానుభవమును మఱచి, యైహికా శాశ్వత
తుచ్ఛఫలములపై గంపెఁడాసతో సర్వదా పాటుపడుచుఁ, ద
మబోధవల గంగఁ గలుపుచుండ నిఁక వైద్యులస్థితిఁ జెప్పనేల!
చిత్తము విత్తాయత్తముఁ జేసిన వైద్యుని యౌషధము రోగికి
బల్లియోజనకారియగునా? దయాదూరుఁడై కఠినబుద్ధిఁ గలిగిన
వైద్యునియందు పరప్రాణహరణ పటిష్ఠముగాక యుండునా? ఇం
దు భిషగ్వరుల తప్పుయులేదు. భరతమాతయిట్టి వారినిగను
టయే మహాపరాధము!

అయ్యో! భారతజననీ! నీగర్భమెంత యపవిత్రమాయె

కఠినాత్ములు, ధనాశాపిశాచగ్రస్తులు, పరహింసా పరాయణు
లు, ఆధ్యాత్మికచింతనా విదూరులునగు కుమారుల-బడసి య
క్కటా! ఎంతటి యపకీర్తిం దెచ్చుకొంటివి! చిరకాలముగ సర్వ
ధర్మసముపేతవని యశంబుఁ గాంచిన నీకిట్టి కుమారులు పుట్టిన నే
మి? పుట్టకున్న నేమి! అట్టివారిని 'నాకుమారు'లని నీవనుకొని
మురియుటకంటె దోషమింకెద్దియు లేదు. కుపుత్రులవియును. సు
పుత్రులఁగనుము. శ్రీరాముని యాజ్ఞ శిరసునవహించి, యతని
యనుజుం బ్రతికించి నయంజనా సూనునంటి దయాపరులంగను
ము. దేవయాని యాక్రందనధ్వని నాలించి కరావలంబనమిచ్చి
కాచిన యయాతినృపువంటి వారింగనుము. అశ్వినీ దేవతలవం
టి వారింగనుము. కఠినబుద్ధులగు రఘునాథరాయిగారివంటి వా
రలిఁక నీకుద్భవింపకుందురుగాక!

గీ॥ వైద్యులును న్యాయవాదులు-వారవనిత
లరయ ననుకంపవిరహితు-లతికుటిలులు
వారిమాటల నమ్మెడు-వాఁడు నెగ్గఁ
జాలరియ్యదిసత్యంబు-సత్యమవని॥





శ్రీ

# రత్నాబాయి.

## ఐదవ ప్రకరణము.



డాక్టరుగా రరిగిన తరువాత రామకిశోరుఁడు తనతల్లి
దేహస్థితి విషయమున నప్రమత్తుఁడై యుండెను. అతఁడెంత
జాగ్రత్తగనున్నను డాక్టరుగారి దివ్యౌషధముగూడఁ బోఁగొట్ట
జాలని నిజజనని రుజమాన్పఁగలఁడా? అంతఁ దారాబాయి తన
కుమారునివంకఁ గడపటిచూడ్కులఁ బఱపి 'నాయనా!' యనిపి
లిచి యీతెలుంగు రాల్పడఁ బైమాటరాక గుప్లనీరు గ్రుక్కు
కొనుచుండెను. 'ఏమమ్మా!' యని రామకిశోరుఁడు సమీపిం
చి, తనతల్లి వదనముం గని దుఃఖింపసాగెను, అంతకంత కాతని
చింత రోదనధ్వానముగా మారెను. అయ్యది యాలించి యి
రుగుపొరుగు వారందఱు వచ్చిరి ఎవరువచ్చిన నేమి' రామకిశోరు
నోదార్చుటకంటెను, దారాబాయిస్థితికి వగచుటకఁ బెను వే
రేమియుఁ జేయలేకపోయిరి. రామకిశోరుఁడు దనతల్లి తలకడఁ
గూరుచుండి 'అమ్మా! అమ్మా!' యని పిలిచెను ఆమె యుఁద
నకుమారునివంకఁ జూచి శోకరసముఁ బైకిఁబొంగి పొరలుచున్న

దోయనఁ గన్నులనిండ నీరుగ్రమ్మి కర్ణాంతములవఱకుఁ బ్రవ
హించి, క్రిందఁబడుచుండఁ 'అన్నా! కిశోరా! ఊరకెల్లు
ముఁ చింతించుటెందులకు? కాఁగలయది గాకమానదుగదా! నీ
కాపరమేశ్వరుఁడే తల్లియైనఁ దండ్రియైన నని యనుకొనుము.
ఇంకనాపై నాసవదలుము ధర్మమార్గమునఁ జరింపుము. ఇంత
కన్న నీకుఁ జెప్పవలసిన దేమి? తండ్రీ' యని హీనస్వరమునఁ బ
లుకుచు మెల్లగాఁ గనులమూసికొనెను రామకిశోరుఁడేమియు
దలుపెట్టెను. మఱియొకసారి తల్లినింబిలిచెను కాని యామె ప
లుకలేదు. రామకిశోరునివంకఁ జూడనైనలేదు. అహా! ఇఁక
మున్నది రామకిశోరునకుఁ బ్రపంచమే యంతరించినట్లు తో
చెను. అతనికాగృహమంతయు శూన్యముగఁ గన్పించుచుండె
ను. నిజమే అతనిమది కిప్పుడు లోకమంధకారబంధురముగఁ గో
చరించుచుండెను. తనప్రాణమునకుఁ బ్రాణమగు తల్లినిగోల్పో
యి గుండెలు బాదుకొనుచుండెను వచ్చినవారెల్ల నాతని కా
శ్వాసవచనముల నెంతగఁ జెప్పుచుండినను నాతనికర్ణకుహరము
లయందావాక్యములు ప్రతిధ్వనించుచుండుటలేదు ఏప్రతిధ్వని
చును? తనకు శాశ్వతాధారమని యెవరినినమ్మియుండెనో, క
ళాశాలకుఁ బోయివచ్చినఁ దన్నుఁ జూచి యుత్సాహభరమున ప్రే
మవారు నన్నపానాదులెవరు ప్రీతితో విచారించుచుండెనో
తనభావి సౌభాగ్యాభివృద్ధికై యహోరాత్రములు నష్టకష్టము





కొఱకు యెవరుశ్రమపడుచుండెనో యట్టితనమాతను బోఁగొట్టు
కొనిన రామకిశోరునిగతి యింకదుర్గతియేకదా! అతనిదుఃఖమపా
రమైనదిగదా! ఏమైనను నెంతసేపుగొట్టుకొనినను దన్నోదార్చు
బంధువులెవ్వరును లేమింజేసి, చింతానలమును లోలోన నే
దిగ్రింగి, కాఁగలకార్యమునకుఁ గడంగక యాతనికిఁ దప్పద
య్యెను. ఆవీధిలోని వారెల్లను వచ్చియుండి. నాఁటిసాయంతన
మాఱుగంటలకు సరికే తారాబాయి కళేబరమును దహనము
గావించిరి.

పాపము! రామకిశోరుఁడు నిస్సహాయుఁడై పోయెను. ఇ
దియాతనికొక పెద్దదుఃఖము! అతనిదుఃఖమునకు మేరయేలేకుం
డెను, తనకనవరతము సంతోషదాయకమగు కళాశాలయు నిత
మప్పుడాతనికి శ్మశానవాటికగఁ దోఁచుచుండెను. తనకెదుట
తారాబాయి యగపడునట్లును గళాశాలకుఁ బొమ్మని యాజ్ఞా
పించినట్లును. నాతఁడు భ్రమించుచుండెను. అతనికీ ప్రపంచ
మేవంకఁజూచినను దుఃఖచిహ్నములను నలలతోఁదను ముంచవ
చ్చుచున్న సాగరమువలెఁ గనఁబడుచుండెను. ఇంతేల! రామకి
శోరుఁడున్మత్తునివలె సంచరింపసాగెను. 'తల్లీ! నన్నుఁగూడఁ
కొనిపోవా? నేను నీవెంటరాఁగూడదా?' అనిగట్టిగా నొ
క్కొక్కసారి యాతఁడు పలవించుచుండును అట్టియాక్రందన
మాలించినవుడెల్ల వంటలవ్వయరుదెంచి యాతని బుజ్జగించిపో

వుచుండును.

అయ్యో! మాతృవియోగ మెంత దుఃఖకరము.

గీ॥ కన్నకష్టంబులసహించి-కనినతల్లి
నీప్సితార్థంబులన్నియు-నిడుతల్లిఁ
బరమకారుణ్యచిత్తయై-పరఁగుతల్లిఁ
బాసియెవ్వఁడుసుఖమున-బ్రతుకనేర్చు॥

---



శ్రీ

# రత్నాబాయి.

## ఆరవప్రకరణము.



తనతల్లికి విధ్యుక్తరీతిని రామకిశోరుఁడు విధ్యుక్తకర్మల నిర్వర్తించిన పదంపడి, కళాశాలలోఁ జేరి, యాసంవత్సరాంత్య పరీక్షలయం దుత్తీర్ణుడై [VI form] ఆఱవఫారమునఁ బ్రవేశించెను. తనకెన్నియిక్కట్టులు సంభవించినను విద్యావిషయమున మాత్రమాతఁ డజాగ్రత్తగ నుండినవాఁడుగాఁడు. కావున నే భగవత్కటాక్షముచే నీసారిపరీక్షలలోఁ గడతేరెను. కాని రామకిశోరున కిప్పుడొక నూతనకష్టము సంప్రాప్తమయ్యెను. వంటలవ్వ యిలుసేరినదిమొదలు భోజనాదికము లందేగడువుచుఁ గొంతపైకమును సహితము దనహస్తగతము జేసికొని, నిర్దాక్షిణ్యచిత్తముతో 'నిఁక నేను నీయింటనుండుటకు వీలులేదు. వేఱొకరిఁ గుదుర్చుకొనుము. నేబోవలయు.' నని యప్పుడప్పు డాతనిని హెచ్చరించుచుండెను. కావున రామకిశోరున కీవిషయమున మిగుల విసుగుజనించి, తానిఁక వివాహమాడుటకై యొకకన్యక నన్వేషింపక తప్పదని యూహించెను. రామకిశో

రుని స్థితిగత కథాంశములనుబట్టి మాపాఠకు లెఱుఁగనిదిగాదు
తనతల్లి వ్యయముచేసిన మొత్తముగాక యించుమించుగాఁ దా
నును వైద్యునకును, వంటలవ్వ వేతనమునకును, భోజనాదిక
ములకును రెండువేలరూప్యములను వ్యయపెట్టెను, అందుచే
ధనమాతనియొద్ద నంతవిశేషముగ నిలువలేదు. భూమిపుట్రలు
గాని. మడిమాన్యములుగాని లేవు. ఇట్టిస్థితిలోఁ గడుబీదవాఁడ
గు దనకుఁ గన్యక యెట్లులభించునాయను చింత రామకిశోరున
కుండుటాశ్చర్యముగాదు. ఎవరుకన్యకనిచ్చినను గుణములనుబ
ట్టియో, యర్థోపార్జనానుకూలమగు విద్యనుబట్టియో యియ్య
వలసియుండును ఐనను రామకిశోరుఁడు నిరుత్సాహపడక. తన
కు సరియగు బాంధవ్య మేయూరఁగుదురునా! యని యనవర
త మాలోచనా నిమగ్నుఁడై, కళాశాలయందలి తోడిసోదరవి
ద్యార్థులలో నొకని కావిషయము విన్నవించెను. అతఁడునురా
మకిశోరుని నిస్సహాయస్థితికి జాలినొంది 'యాందోళనపడకుమని
యుఁ, దగుసంబంధము లభింపఁగలదనియుఁ పాటలీపుత్రమునఁ
గాయస్థవంశమునకుఁ జెందిన విద్యావతియు సుగుణవతియు నగు
నొకకన్యక గలదనియు నామెను గుదుర్చుకొని వచ్చుకార్యము
తనదియనియుఁ జెప్పెను. అటుపిమ్మట రామకిశోరుఁడు పలుమా
ఱు ఆవిషయమై యాతనితోఁ బ్రస్తావించుచువచ్చెను.

తుదకొకనాఁడాతఁడు పాటలీపుత్రమునకుఁ బయనమై





పోయి, తనకంతకుమున్న పరిచితుఁడును, గన్యాజనకుఁడునగు
సంబికాచరణునకు రామకిశోరుని యోగ్యతలను గుఱించియు,
నాతని గుణగణములను గూర్చియు వచ్చఁజెప్పి, కన్యక నొసఁ
గునట్లాతనియొద్ద వాగ్దత్తముఁ గైకొనియెను. మఱియు సంబి
కాచరణుని కుటుంబమునఁ బురాతనకాలము నుండియుఁ దాం
డవమాడుచుండు దురాచారమగు కన్యాశుల్క విషయమును
గూడ గొంచెమెచ్చుతక్కువగ నావిద్యార్థి యొప్పుకొనక తప్ప
దయ్యెను. ఈయుదంతమును రామకిశోరునకా విద్యార్థి రంగ
పూరునకేతెంచి నివేదింప నాతఁడు కట్నమివ్వవలసి వచ్చినందు
లకొక్కింత ప్రథమమునఁ జింతింపక పోలేదు. కాని యేమూ
లఁజూచినను సంబికాచరణునకంటెఁ గన్యాశుల్కగృహీతలుమి
న్నగనుండుటచే విధిలేక కన్యాశుల్క పిశాచపువాతఁ బడవలసి
వచ్చెను. కావున సంబికాచరణుని పుత్రికయగు సరళాబాయిని
వివాహముఁ జేసికొనుటకు రామకిశోరుఁడంగీకరించి, వైదువం
దలిచ్చి ముహూర్త నిర్ణయముం గావించికొనియెను మహావైభ
వములో వైవాహికమహంబుగడచెను. ఇప్పటికి రామకిశోరున
కు వైవాహికమునకు వ్యయమైన మొత్తము పోఁగా మిగిలిన
దాదాపు అయిదాఱువందలు రూపాయలు మాత్రమే యుం
డెను. రామకిశోరునకు సాధారణముగఁ బుట్టినప్పటినుండియుఁ
గష్టములే సంప్రాప్తములగుచున్నవి. వివాహము చేసికొనినను

నాతనికి సుఖములేదయ్యె. తల్లి జీవించియుండినపుడు కొంత
యు, ఆమె పడకఁబట్టినపుడు కొంతయు, వైవాహికాది వ్యయ
ములకుఁ గొంతయు ద్రవ్యమైపోవుటఁ బారకులెఱింగినదియే
న్యాయమగు వ్యయములటుండ, విపరీతమగు వైద్యసహాయము
పేక్షించి డబ్బును వ్యయమొనరించుటయుగాక, కట్నములకని
యనవసర దుర్వ్యయమొండు నెత్తిపైఁబెట్టుకొనెను. కాని య
దిరామకిశోరుని దోషమా? పూర్వాచారమని మన దేశమాత
గర్భసాగరమున బుట్టినకాలకూట విషతుల్యులగు దురాత్ముల
ప్రవర్తనచేఁగలిగిన ప్రమాదమేగదా! సామాన్యస్థితియందుం
డు నసంపన్నులకు వీరియండ బ్రదికియుండఁదరమా? ఆట్టిదుర
దృష్టుల జీవితమదోగతిపాలు గావలసినదేనా? వారుగృహస్థులై
యుండ నోచుకొనలేదా! వారుప్రపంచము ననిష్ప్రయోజకు
లా? అయ్యో! ఎంతవిపరీతకాలము! వివాహములేక, వంశవృద్ధి
నొందించుకొను నుపాయముఁగానక యెందఱు బ్రహ్మచారు
లు మనదేశమాతగర్భమున నున్నవారోగదా! వివాహముకా
ని లోపమునఁ నింద్రియపరాజితులై విటాగ్రేసరులై యెంద
ఱు వటువులు దేశమున దేవులాడుచున్నారోగదా! వ్యభిచారిణీ
సంయోగంబునంజేసి, యసంఖ్యాకంబులగు వ్యాధులచే బాధి
తులయి, యెందఱువర్ణులు వలవించుచున్నారోగదా! ఎందఱు
బ్రహ్మచారులట్టి రోగములవలనఁ గృతాంతుచెంత కరుగుచు





న్నవారోగదా! అయ్యో! ఎందఱో నీకుటుంబములోని బ్ర
హ్మచారులు కన్యకలకై యాశించుచుండఁ గట్నములకై నిత్య
సంతానవంతులగు గృహస్థులేడ్చుచుండుట ధర్మమా! అట్టివా
రు గృహస్థులు గాఁగూడదనియే పరమేశ్వరుని యభీష్టమా! అ
ట్లయిన నాతఁడుగూడ నిర్దయుఁడే. కాని యాతఁడట్లెన్నఁటికిని
దలఁపఁడు ఆతఁడు కరుణాసింధువు, కావుననే భారతమాత గ
ర్భమున నెందఱో విద్యావంతురాండ్రను, శీలవతులను, సద్గుణ
సంయుతలను, కన్యకామణులను సృజించినాఁడు, సృజించుచు
న్నాఁడు. ఆతనికంత పాటెందులకు? దీనులగు బ్రహ్మచారుల
ను గృహస్థులనుగాఁ జేయుట కేకదా! అయ్యదిదెలియక కట్న
ములు, కట్నములని కలవరించునో పూర్వాచార పరాయణులా
రా? మీబుద్ధులు పెడతలఁబట్టుచున్నవేల: మీకుమతులులేవా!
భగవదుద్దేశమును భంగపరచునంతటి పాపాత్ములామీరు! అ
య్యో! మీహృదయములెంత కఠినములు! కట్నములుకలకా
లము నిలుచునను కొంటిరా! గుణములును, కీర్తియు. శాశ్వత
ములుగాని, మీరుస్థిరములని నమ్మియుండు నీకట్నపురూకలు-
మన దేహములు శాశ్వతములుగావుసుఁడీ! యోచింపుఁడు. పూ
ర్వాచారమనుకొను నీదురాచారమును వదలుఁడు కట్నములకై
కాని కన్యకలవిక్రయించుట పూర్వాచారమా! కాదు. కాదు.
ముమ్మాటికినిగాదు. మఱి మాంసవిక్రయము! పలలవిక్రేతల

కును మీకును భేదమేమి? మీపూర్వు లిట్లాచరించియుండిన, వారును గసాయివారే. కానివారట్లు కట్నములకాసపడి. తమగర్భమునఁ బుట్టిన సౌందర్యవతులగు కూఁతులఁ గురూపులకు విద్యాగంధ విహీనులకు నంటగట్టిరా? లేదు లేదు. సద్గుణుఁ డెవ్వఁడో-విద్యావంతుఁ డెవ్వఁడో యట్టివానికొఱకు వెదకివెదకి వేసారిరే. అట్టివాఁడేలభించిన వారియానందమునకు మితిలేదే అట్టివానిని భగవత్స్వరూపునిగాఁ దలఁచుచు, సాలంకృతముగఁ దమకుమార్తెలను దానముఁజేసి, తమవంశములను బావనముఁ జేసికొనిరే. అట్టివారి కడుపులఁబుట్టిన మీరింత నిర్దయాత్ములరగు టెంతదోసము? కన్యావిక్రయమునకుఁ గడంగు టెంతపాపము? పైఁగాఁ బూర్వాచారమని మనపెద్దలపై నాదోసముఁ ద్రోయుటయా? అకటా! దేశసౌభాగ్య వినాశకులారా! సంఘసౌఖ్య విధ్వంసకులారా! మీవలన దేశమున కెంతటి యపకీర్తి! అయ్యో! హిందూసంఘమెంత హీనస్థితికివచ్చెను.

గీ॥ కన్నకూఁతులనమ్మెడు-కఠినబుద్ధు
లవనినుండెడునందాక-హైందవులకు
మేలుగలుగునె? శుభములు-గ్రాలగలవె!
దేశమాతముదంబుధిఁ-దేలఁగలదె?॥



శ్రీ

# రత్నాబాయి.

## ఏడవ ప్రకరణము.



కాయస్థవంశమున రజస్వలా వివాహములఁజేయు నాచారము లేకపోవుటచే సరళాబాయిని చిన్నవయసుననే రామకిశోరునకు వివాహమాడెను. ఆయమయును బాల్యమునఁ జస్నదయ్యెను బుద్ధిని పెద్దయై పుట్టినయింటికిని, మెట్టినయింటికిని యశంబుఁ జేకూర్చునంతటి మహిమఁగలిగి యలరారుచుండెను. కావున రామకిశోరుఁడామె సుగుణములకును, సౌభాగ్యశీలమునకును నిర్భరానంద పారవశ్యముఁ జెంది, పరమేశ్వరు ననుగ్రహముచే ననుకూలవతియగు దారలభించెనని తన పూర్వజన్మ సుకృతము నప్పుడప్పుడు పొగడుకొనుచుండును. అతని కితరాధారము లేనందుచేతను, ప్రేమాస్పదయగు తనభార్య నెడఁబాసియుండుటాతని కంతయిష్టముగ లేకపోవుటచే తను దనయింటనే యామెనుంచుకొననెంచెను. సరళాబాయియు నట్టి యభిప్సితముతోనే యుండుటచేఁ దనతలిదండ్రుల యనుమతిం గైకొని రంగపూరునఁదన నిజనాథుని గృహమునందే యుండి

యాతని యానతినెల్ల పనులును జక్కఁగా నెఱవేర్చుచుఁ, గాం
తుని కాహ్లాదముఁ గలిగించుచుండెను. వంటలవ్వను దనభర్త
నిలుపుదలఁ జేసినందున నింట వంటవార్పు మొదలగు గృహకృ
త్యములు దీర్చుకొని మధ్యాహ్నము దీఱికగనున్నప్పుడు పతివ్ర
తల చరిత్రములును, దంపతుల ధర్మములును, భారతభాగవతా
ది గ్రంథములును జదువుచుఁ దనఁతో బొద్దుపుచ్చ నరుదెంచి
న స్నేహితురాండ్ర కా గ్రంథములలోని విషయములు బోధిం
చుచుండును. భర్త కళాశాలనుండి యింటికరుదెంచిన వెంట
నే భక్తిపూర్వకముగా నాతని కొనర్పవలసిన పరిచర్యలొనర్చు
చుండుట నాదంపతు లన్యోన్యానురాగమున మెలఁగుచుండిరి.
ఇట్లుండఁగా, రామకిశోరునకు సాంవత్సరిక పరీక్షలు సమీపిం
చుచుండెను. కావున నందుత్తీర్ణుఁడగుట కాతఁడు రేయింబవళ్లు
శ్రద్ధతోఁ బాఠములు పఠించుచుఁ, బరీక్షాంశము లావత్సరము
మిగులఁ గఠినములుగ నున్నను, దేవుని యనుగ్రహము వలన
(School-Final) స్కూలుఫైనలందుఁ బ్రథముఁడుగ గడ
దేరెను. ఆతనికదియొక నూతనసంతోషదాయకమైనను
తనయొద్దనున్న ధనము నానాఁటికి వ్యయమైపోవుచుండుటచే నిం
కను జదువుటకు వీలులేదయ్యెఁగదా యనియు, ధనోపార్జనము
నకు మార్గమెయ్యదియా యనియుఁ జింతింపసాగెను. ఇట్లుండ
నాతనిభార్యయు యుక్తవయస్కురాలై సాంసారికబాధ్యతఁ





బైవేసికొనవలసిన తరుణము తటస్థించెను. ఆయమముఖము
నవఫుల్లనీరేజముమాడ్కి భాసిల్లుచుండెను. కన్నులాకర్ణాంత
విశాలములై నిజనాథునకుఁ బ్రేమరసమును, దీనులకు దయా
రసమును, మూఢులకు జ్ఞానరసమును, బ్రసాదించుచుండెను.
కెంపెనవి పాటలమును నిరసించుచుఁ జిఱునవ్వున కాస్థానసీమ
యై వెలయుచుండెను. ఇంకను దీర్చిదిద్దినట్లుండు నాసికయును,
నవకంబుల నవహేళనము సల్పు కర్ణద్వయంబును, నామెమో
మునకు వింతశోభనిచ్చుచుండెను. ఇంతేల! యౌవనలక్ష్మీ నిత్య
తాండవ రంగస్థలమనుటకంటె సరళాబాయి సౌందర్యము న
క్కుడుగ వర్ణింప నాయట్టివానికి సామర్థ్యము చాలదు. ఇట్టి సర్వ
లక్షణసముపేతయగు ప్రేయసింగూడి సంసారము సుఖముగఁ
గడుపుచున్నను, రామకిశోరునకు లేమియొకగొప్ప కొఱంతవాటి
ల్లెను. నిజమేగదా! 'సర్వేజనాఃకాంచనమాశ్రయంతి' యను
నట్లు ధనము లేకున్న నాతనికిఁ దక్కిన విద్యయుండినను నిష్ప్ర
యోజనమెగదా! రామకిశోరుని స్థితియునట్లేయుండెను. ఆతని
కేదియుఁ దోఁపలేదు. ఒకనాఁటిసాయంసమయమునఁ దనకు
టీరమునకు ముందుండెడు విహారోద్యానవనమున నొకఱాతి
తిన్నెపైఁ గూరుచుండి తనలోఁదానిట్లు తలపోయఁ జొచ్చెను.
'అకటా! నేనెంత దురదృష్టవంతుఁడను. బాల్యమునుండియుఁ
గష్టములే యనుభవింప నన్నాభగవంతుఁడు సృజియించి యుం

డనోపు! కాకున్న జననీజనకులఁ గోల్పోయి, యున్నధనమంత దుర్వ్యయముఁ జేసికొని, కడునిడుములఁ బడవలసివచ్చునా? ఇప్పుడిన్నాళ్లకు వివాహముఁజేసికొని గార్హస్థ్యమవలంబింపఁబూనుకొన్న తఱి ఘోరదారిద్ర్యమునకు గుఱియైతిఁగదా!

అయ్యో! నేనెట్లీ సంసారార్ణవ మీదఁగలను? ఇంకను విద్యావంతుఁడ నగుదునన్న ధనము లేకుండుటచే నయ్యదియు సాధ్యముగాదు. ఓపరమేశ్వరా! నామనోభీష్టములు చెల్లనీయక యడ్డపడుట దయాస్వరూపుఁడవగు నీకుఁ బాడియా? ఎన్నటికైనను నీవే నాకుగతియని విశ్వసించిన నన్ను నాశముం జేయుట నీకుఁదగదు. దేవా! ఇవిగో నీకు నతిశతంబులు. నాకోర్కెలీడేర్పుము నన్నుద్ధరింపుము.' అని భగవంతు ననేకవిధములఁ దన మనమునఁ జింతించుకొనుచు నేదియో జ్ఞాపకమునకు రాఁగాఁ దనజేబునుండి కాగితమును, మషీజల పూరితలేఖినిం గైకొని యాంగ్లమున నేమియో వ్రాసి, యాయుత్తరముఁ దానివసించు వీధిలోనుండు తపాలుపెట్టెలోఁ బడవైచెను.

గీ॥ గణనకెక్కినమిత్రులఁ-గలిగియున్న
సుందరీమణియాసతిఁ-బొందియున్న
ధనమదొక్కటితనయొద్దఁ-దనరకున్న
నరునకన్నియువ్యర్థంబు-లరసిచూడ॥





శ్రీ

# రత్నాబాయి.

## ఏనిమిదవప్రకరణము.



రామకిశోరుఁడు ద్రవ్యాభావముచేఁ దన చదువునకు స్వస్తిఁ జెప్పి, యింటియందే యుండ, నొకనాఁడు వార్తావాహుడొక్క యుత్తరమొకదానిని దెచ్చి యాతనికందిచ్చెను. ఆతఁడతి సంభ్రమంబునఁ గైకొని చించి, యందులోనుండు నుత్తరమీరీతిఁ జదువఁదొడఁగెను.

'ఆర్యా! మీరువ్రాసిన యుత్తరముం దిలకించితి. మీరుమాయొద్ద నుండెదమనుట యానందదాయకము. 6-5-1911 తారీఖునకు లోపుగ మాకార్యాలయమునఁ జేరవలయును, మాసమునకు ముప్పదిరూప్యంబుల చొప్పున మీకు వేతనమేర్పాటుఁ జేసితిమి. మున్ముందు మీయోగ్యతఁగనిపెట్టి వేతన మభివృద్ధి పఱుపఁగలము. గమనింపుము.

ఇట్లు,

రంగపూరు,
26—4—11

ఆర్. గిరిధరరావు.
గణేశకంపెనీ ప్రొప్రయిటరు.

ఆంగ్లేయ భాషలో వ్రాయఁబడి యుండు నాయుత్తరముం జూచినంతనే రామకిశోరుఁ డమందానంద కందళిత హృదయారవిందుఁ డయ్యెను. తత్క్షణమే యావిషయముఁ దన ప్రియకాంత కెఱింగింప, నామెయును సగర్వముగా నానందించెను, రామకిశోరుఁడు శుభదినమొకదాని నేర్పఱచికొని యుద్యోగస్వీకరణముఁ గావించెను. తనకువచ్చు వేతన మత్యల్పముగ నుండినను నిరుత్సాహమందక భగవదనుగ్రహమునఁ దుదకీ వృత్తియైన లభించెగదాయని సంతృప్తి నొందియుండెను.

అప్పుడప్పుడు దనపూర్వస్థితిఁ దలంచుకొని రామకిశోరుఁడు సాధారణముగఁ జింతించుచుండుటయుఁ గలదు. ఆతనికి స్వాతంత్ర్యేచ్ఛ యెంతయెక్కుడుగ నున్నను సంసారభారము బడుటచేఁ బరతంత్ర జీవనమువలన నాతఁడు కాలముఁగడుపక తప్పదయ్యెను. ఇంకను విద్యనభ్యసించి దేశమాతృసేవనముఁ జేయవలయుననియు హిందూసంఘమున నిండియుండు ఘోర దురాచారములఁ బోనాడవలయుననియుఁ దనజీవితమునుఁ బవిత్రవంతముగను, సార్థకముగను జేసికొనవలయుననియు నాతనికుండిన యభిలాషమంతయు సంసారసాగరమున నొక్కసారిగమునిఁగిపోయెను.

రామకిశోరుఁ డీరీతి గణేశకంపెనీలో నుద్యోగమును నిర్వర్తించుచుఁ దనభార్యయుఁ దానును సుఖముగఁ గాలక్షేప





ముసేయుచుండ నట్లు ముప్పదియైదు వత్సరముల ప్రాయము గడచెను.

ఆతని ధర్మపత్నియగు సరళాబాయి గర్భవతియై యొక శుభలగ్నమున లక్షణయుతయగు నొక కుమారీరత్నముం బడసెను. పుత్రికగలిగిన సుఖానందమును వెల్లడించునంతటి యాడంబరముగ నామకరణ మహోత్సవము నడుపుట కాతనికిప్పుడు మునుపటివలె ధనములేదు. మాసవేతనము భోజనాదులకే సరిపోవుచుండెను. ఐనను దోశిబందుగుల మధ్యఁదలవంపులుగా నుండునేమోయను భయమున ఋణమైననుజేసి తనకుమార్తెకు నామకరణ మహోత్సవము జరుప నిశ్చయించుకొనియెను. కాని యతనికప్పిచ్చెడు వారెవ్వరు! రామకిశోరున కత్యంతాందోళనము మనమునఁ బ్రవేశించెను. ఏమిచేయుటకును దోఁపక నాలోచించుకొనుచుండెను, తుదకుఁ దనకుఁ బోషణకర్తయగు గిరిధరరాయని యొద్దనే వందరూపాయ లప్పుఁబుచ్చుకొనుటకును బ్రతిమాసమును దనకిచ్చు వేతనమున బది రూప్యముల వంతున నా మొత్తము పూర్తి యగువఱకు నిచ్చుటకును నిశ్చయించుకొని యాప్రకార మొనరించెను. ఈరీతిఁ దనకు లభించిన పైకముతో నామకరణ మహోత్సవము నతివైభవముగ జరిపి, యా యాడుబిడ్డకు 'రత్నాబాయి' యని నామకరణముఁ జేసెను.

శుక్లపక్షేందుని మాడ్కి యాపసిబిడ్డ దిన దినాభివృద్ధి నొందుచు నైదేండ్ల బాలిక కాఁగానే, రామకిశోరుఁడు దా నునివసించు శ్రీధర్ వీథియందుఁ గడువఫ్సునుండు హిందూ బాలికా పాఠశాలలో విద్య నేర్చుట కొక శుభవాసరమునఁ బ్రవేశపెట్టెను. అది మొదలా బాలికామణియు, విమలధీయుతురాలై, శ్రద్ధతోఁ జదువుచుఁ దన యుపాధ్యాయినులకును, దలిదండ్రులకును గరంబు ముదంబుఁ గూర్చుచుండెను. సంస్కృతమునను, హిందీయందును నిరుపమాన ప్రజ్ఞను బడసి తోడి విద్యార్థినులకెల్లఁ దలమానికయై తనరుచుండెను. మఱియు రత్నాబాయి విశ్రామకాలములయందు దిమకసేపు తనయీడు బాలికలతో నాడుకొనుచును, నిజమందిరారామములోని వృక్షములకు నీరుపోయుచును, బండి యొండి రాలిన యాకులను నేఱి పాఱవేయుచును ''రకరకములగు పువ్వుజెట్టులఁ దెప్పించి, పాతుచును, గాలముఁ గడపుచుండును. తన యొలదోఁటలోఁ బూచుమల్లియ గుండుమల్లియ, విరజాజి, చేమంతి మున్నగు పుష్పముల ను గోసి మాలికలుగఁ గట్టి, తనయింటనుండు పటముల కలంకరించుటయగాక, స్నేహితురాండ్రకును బంచిపెట్టుచుండును. తానును కేశబంధమునఁ గొన్ని ముడుచుకొని, యానందించుచుండును. కేవల మెనిమిది తొమ్మిదేండ్ల బాలయగుటచేతఁ దనస్థితిగతుల నారయునంతటి శక్తి లేక, దుఃఖమనునది తెలియక, సఖీజన





ముంగూడి యాట పాటలతోఁ బ్రొద్దుబుచ్చుచుండెను.

సరళాబాయియు రామకిశోరులును దమ యేకపుత్రికయగు రత్నాబాయిని మిగుల గారాబముతోఁ బెంచుచుండిరి. కాని తన ముద్దుల కూఁతునకు వలయు నాభరణములు నుడుపులు పాఠశాలావేతనము మొదలగునవి నూతనముగ నెత్తిపైఁబడిన వ్యయములైనందునఁ దనకు ముట్టుచున్న ముప్పదిరూప్యములాతనికిఁ జాలవయ్యెను. అందుచేఁ జిక్కైనప్పుడొకపరి తన యజమానియగు గిరిధరరావుగారి తోడఁ దనకష్టస్థితులన్నియు నాతని హృదయము కరఁగునటులు చెప్పుకొన, నలువది రూప్యముల వఱకును వేతనముఁ బొడిగింపఁ బడెను. కంపెనీలోని యుద్యోగులెల్లరకంటె విశ్వాస పాత్రుఁడును, బ్రతిభావంతుఁడును నగుటచే రామకిశోరుఁ డామాత్రపు దయను గిరిధరరావుగారి వలన సంపాదించుటొక యబ్బురముగాదు.

ఇట్లుండ, సరళాబాయి మరల గర్భము దాల్చెను. ఒక శుభముహూర్తమునఁ బురుషశిశువు నామె ప్రసవించెను. లేక లేక కలిగిన యాకుమారునికి జాతకర్మాదులు మహావైభవమ్ముగ జరుపవలయునని రామకిశోరున కెంతో యుత్సాహమున్నను, ధనముమాత్రము లేనందుచే, నీవరి యేఁబదిరూప్యములొకచోట నప్పుఁదెచ్చి నామకరణము నొకరీతిగ నిర్వర్తించి, కుమారునకు 'హరికిశోరుఁడని పేరుపెట్టెను. ఆబాలుఁడు సులక్షణ

ఁతుండయు గ్రోలుచుండుటం జేసి, యాబుడుతఁ గాంచిన జ్యోతిష్కులెల్ల రాతఁడొక మహాపురుషుఁడగునని చెప్పుచువచ్చిరి. దినదిన ప్రవర్ధమానుఁడగుచు నాబిడ్డయుఁ దల్లిదండ్రుల నానందాబ్ధి నోలలాలించుచుండెను. రత్నాబాయియుఁ దనచిన్న దమ్మునిఁ బ్రీతితో నెత్తికొని ముద్దాడుచుఁ దోడిబాలికలతో నాడునప్పు డాబిడ్డనుగూడ దమమధ్యఁ గూరుచుండఁబెట్టుకొని నవ్వించుచు, నుద్యానవనములోని పుష్పములఁ జూపుచు నెంతో సంతసపడుచుండెను.

గీ॥ పుష్పగుచ్ఛంబు లేని-భూజమట్లు
భూషణంబులు లేనియా-పొలఁతియట్లు
తారకలు లేనియభ్రప-థంబునట్లు
సుతులు లేనట్టిగృహమది-శోభగను నె?





శ్రీ

# రత్నాబాయి.

## తొమ్మిదవ ప్రకరణము.



వర్షమునకు వసంతాగమమైనభంగి రత్నాబాయికి యౌవనోదయ మగుచుండెను. పదుమూఁడేఁడుల యీడుఁగల యా కన్యక బంగరు సలాకవలెఁ బ్రకాశింపఁ జొచ్చెను. కాని, యింతవఱకా కుసుమ కోమలాంగి నడుగుట కెవ్వరునురాలేదు. రజస్వలా వివాహము రామకిశోరుని యింటి యాచారము గాకపోవుటచే, రత్నాబాయి పుష్పవతి యైనచోఁ, దన్నుఁ గులము నుండి బహిష్కరింతు రేమోయను భయము రామకిశోరునకు జనింపక పోలేదు. కాని, యతఁడేమి సేయఁగలఁడు! రంగపూర్వారునందును, పాటలీపుత్రమునందును మఱికొన్ని పత్తనముల యందును రామకిశోరునకు బందుగులుండిరి. కాని, యే కుటుంబమున విచారించినను. దగినవరుఁడు లభింపక పోవుటయో, యైదువేలో, లేక పదివేలో శుల్కమిమ్మనను వా రగపడుటయో సంభవించుచుండెడిది.

శుల్కములన్న రామకిశోరునికిఁ గంప మెత్తుచుండెను.

ఆతఁడిట్టి గొప్ప మొత్తములు వరశుల్క పిశాచగ్రస్తుల వాత న
ర్కడనుండి తెచ్చి పోయఁగలఁడు? రెండువందలా! మూడువం
దలా? వేలసంఖ్య గావలయునే! నలువది రూప్యముల మాసవే
తనముతోఁ గుటుంబమును బోషించుకొనుటకేఁ గూడ శక్తిచా
లక ద్రవ్యమునకై కష్టపడుచుండు రామకిశోరుఁ డిట్టి ధనతృ
ష్ణఁ గలవరులఁ దన ప్రియపుత్రిక కొఱకెట్లు తేఁగలఁడు? తెచ్చు
టకు సాధ్యముగాదా! కాకున్న వరశుల్కము లభిలషింపని వా
రలకేఁ దన కన్యక నీరాదా! అట్టివారు లేరా! ఉన్నారు. ఉండి
న లాభమేమి! వారు విద్యావిహీనులు: గుణహీనులుగ నుండి
రి. అట్టివారికి నెఱిఁగి యెఱిఁగి రామకిశోరుఁడెట్లు తన ముద్దుల
పట్టి నియ్యఁగలఁడు?

అయ్యో! రామకిశోరున కెట్టి కష్టము సంభవించెను,
తనకు సంభవించిన యీ నూతన పరిస్థితిం దలఁచుకొనినపుడె
ల్ల భయ విభ్రమంబులకుం గుఱియగుచు, దేహమంతయుఁ జి
ఱుచెమ్మటలు గ్రమ్మ, నితాంత చింతానల తప్తుఁడగుచుండెను.
ఆతని వదనమే వాడినపద్మమువలెఁ గళావిహీనముగఁ గన్పట్టు
చుండెను, తిన్న యన్నముగూడ నిట్టివారలకు నొంటఁబట్టకుం
డుటను టాశ్చర్యమా? ఒకనాఁడు రామకిశోరుఁ డేకాంతముగఁ
దనగదిలోఁ గూరుచుండి యిట్లు చింతింపఁ దొడఁగెను.

అకటా! కాలవైపరీత్యము నేమనవచ్చును? రానురాను





నాయట్టి సామాన్య గృహస్థుల జీవిత మీ దేశమునఁ గాలవిశే
షమునుబట్టి దుర్భరమగుచున్నది. కాలచక్రము దిరుగుకొలఁది
ని సంసార సముద్రమునఁ బరిభ్రమించుచు, దేశసేవకింతేనియు
నదనులభింపక మిడుకుచున్నానుగదా! నాదురదృష్ట పరంపరలే
నన్నుదురొక్కొనుచున్నవి. ఎప్పుడీ యాపత్తరంగములనుండి బయ
టఁ బడుదునో యెఱుఁగకున్నాను. ఇన్నాళ్లకుఁ బుత్రికారత్న
మొండు గలిగెఁగదాయని సంతసించుచున్నఁ, దగినవరుఁడుదొ
రకక మనోవ్యథ నందవలసిన స్థితి సంభవించెను. ఆమెకు యౌ
వనమా:—సమీపించుచున్నది. రత్నాబాయి రజస్వల యైన
చో నాకుఁ గులమునుండి బహిష్కారము. నాముష్నుల పట్టికా
వనవాసప్రాప్తి, వరుఁడా—ఇంతవఱకును లభింపకున్నాఁడు. లభిం
చినను గట్నములన్న దయ్యము లడ్డుతగులుచున్నవి. హా! పర
మేశ్వరా! నీకునయితము నాపైదయలేదా? నాకీదుర్భర దుఃఖా
నల మొడిఁగట్టి, నేదహింపఁ బడుచుండ, వేడుకఁజూచుచుండ
నీకుఁ బాడియా? నాకెప్పుడీ కష్టసాగరమునుండి విముక్తిఁగలిగిం
తువు? అయ్యో! నాకేదియు మార్గము దోఁపకున్నదే? దేశత్యా
గినగుదునా?.... .... .... ....ఎంతపని? తనకుమాత్రముంద
గిన వరుని గుదుర్చుకొను శక్తిచాలక జన్మభూమిని వదలిపెట్టెనని
లోకులాడికొనరా? అట్లుజేయవలయు? ఇప్పుడే నా ప్రియతన
యయగు రత్నాబాయిని, బ్రాణేశ్వరియగు సరళాబాయిని

నిమిషమాత్రమున నొక నిశిత కరవాలమున కేరఁజేసి, నేనును బ్రాణముల బాసెద. అప్పుడుగాని యీకష్టమునుండి తరింపఁజాలను..... .... .... .... ఛీ! ఏమినాబుద్ధి! ఎంతఘాతుక కృత్యమున కొడిగట్టుచున్నాను. స్త్రీహత్య. అందును స్వదార హత్య! ఆత్మహత్య! ఔరా! ఎంతఘోరము! ఇట్టికార్యమొనర్చుట మనుజలక్షణముగాదు. ఆతురపడుటచే లాభముండదు. కావునఁ గడపటి ప్రయత్నమొండాచరించెద. పరమేశ్వరుని యనుగ్రహమున్న నాప్రయత్నము వ్యర్థము గానేరదని యనుకొనుచుఁ గాకితమును గలమును జేతఁబుచ్చుకొని, యుద్యానవనమున నొకచోటఁ గూరుచుండి లేఖ నెక్కడికో వ్రాసి, తపాలపెట్టెయందుఁ బడవైచి వచ్చెను.

గీ॥ ప్రబలతరకష్టసంతతుల్-ప్రాప్తమైన
సమయమునఁగూడఁజింతకు-స్థలమునీక
విమలమానసుఁడైయెపుడు-వెలుఁగువాఁడె
సౌఖ్యమునుబొందఁజాలునీ-జగతియందు॥





శ్రీ

# రత్నాబాయి.

## పదియవప్రకరణము.



సాయంసమయ మగుచుండెను. లోకబాంధవుఁడు వృద్ధుఁడై, దేహపటుత్వము తగ్గి యస్తమింపఁ బోవుచుండెను. అట్టియెడ రామకిశోరుని గృహబహి రుపవనమధ్య మందొకఱాతిన్నియపైఁ గన్నియయొకర్తు కూరుచుండి యుండెను. ఆమెకుఁ గుడివైపున 'రుక్మిణీపరిణయ' మనుగ్రంథ మొకటియున్నది. ఆ పొత్తమును గొంతవఱకుఁ బఠించి, యామె దాని నక్కడ నుంచి యీరీతి నాలోచింప నారంభించెను,

'అయ్యో! నా జనకుఁడు నా కొఱకు ననుభవించు కష్టములఁ జూచిన నాకు దుఃఖము జనించుచున్నది. అకటా! నన్నా భగవంతుఁ డింత దౌర్భాగ్యురాలి నేలసృజించెను! సృజించెఁబో, తగినఁ వరు నెందైన లభింపఁ జేయరాదా! లభింపకున్న మానె. యుక్తవయస్సింత శీఘ్రముగ నాకు వచ్చుచుండు టెందుఁకో! .... ...., .... ....' అని యింకను నేమేమియో యా బాలికామణి తలఁచుకొనుచుఁ దనదుస్థితికిఁ గన్నులనీరుగాఱ మా

నముతోఁ జెక్కుటఁ జేయఁజేర్చి, క్రిందుఁ జూచుచు మూర్తీభ
వించిన శోకరసాధి దేవతవలె నగపడుచుండెను.

ఇంతలోఁ దన యుద్యోగధర్మము నిర్వర్తించి రామకి
శోరుఁ డింటికివచ్చెను. అయ్యది గ్రహించి ప్రియపుత్రియగు
తన్నుఁజూడ నాతఁడు వెదకులాడు నేమోయని వెంటనే రత్నా
బాయి లోనికేగెను. ఇట్లువచ్చిన భర్తను, కుమారితను జూచి
సరళాబాయి యొకయుత్తరమును దెచ్చి రామకిశోరుని చేతికం
దిచ్చుచు రత్నాబాయినింగాంచి 'రత్నా! నీవింతదనుక నెక్కడి
కరిగియుంటివి? నీకొఱకిల్లంతయు వెదకితినే. బడి యిప్పుడే వద
లిరాయేమి?

రత్నా:—లేదమ్మా! తోఁటలోఁ గూరుచుండి పుస్తకముఁ
జదువుకొనుచుంటిని.

అంత రామకిశోరుఁ డాచ్ఛాదిత పత్రముంజించి, యం
దలియుత్తరముఁ దనప్రియపత్నియుఁ, బుత్రికయు వినునట్లు ఈ
మాడ్కిఁ జదివెను.

'శ్రీయుతులు. రామకిశోరుగారికి:—

ఆర్యా! మీరువ్రాసిన యుత్తరము మొన్ననే, యంది
నది. తమయనుంగు కుమరితయగు రత్నాబాయి శీలమును,
విద్యాప్రభావమును, రూపలావణ్య విలాసాదులును దమయుత్త





రమువలననే గాక, యంతకుమున్నె కరిద్దతి వలన నాకర్ణించి
యుంటిని.

మీ యభిమత ప్రకారము తమ తనయను, నేనువివా
హమాడుట కభ్యంతరమూ వంతయైనలేదు. కాని, నా యభి
ప్రాయమునకుఁ దామొడంబడిననే, యీకార్యము నెఱవేఱఁ
గలదు. నేనొక బీదకుటుంబమున జనించిన వాఁడను. ఐనను,
నాకున్న సామాన్యపు టాస్తి సాయమునను, గొందఱు విద్యా
భిమానులచే యూఁతవలనను, ప్రస్తుతమీ నగరమందలి ప్రభు
త్వ కళాశాలయందు బి. ఏ. తరగతిఁ జదువుచున్నాను రాగల
వత్సరమున న్యాయశాస్త్ర కళాశాలయందుఁ జేరి చదువ నిశ్చ
యించియున్నాను, కావునఁ గళాశాలకగు వ్యయముల కయిదు
వేల రూప్యములఁ గట్నముగ నిచ్చిన: దమపుత్రికారత్నమును
వివాహముఁ జేసికొందును. నా జననీజనకుల యభిలాషమును
నిదియ. తారిందుంబొడఁబడునెడఁ ద్వరితముగఁ బ్రత్యుత్తర
మీయఁగోరెదను.

చిత్తగింపుఁడు:
ఇట్లు
శ్యామసుందరుఁడు;
బి. ఏ. క్లాసువిద్యార్థి;

రామకిశోరుఁ డొక్కనిట్టూర్పును విడిచి లేఖను మడ
చెను. అతని వదనము కళావిహీనముగఁ గన్పట్టుచుండెను. ఇఁక

సరళాబాయి యొక్కయు, రత్నాబాయి యొక్కయు, స్థితిఁ జెప్ప
వలయునా? వారు నిశ్చాంతపోయి, యాతని మోమునే చూచు
చుండిరి. రామకిశోరుని నయనద్వయమునుండి బాష్పధారలు
గురియుచుండెను. 'పరమేశ్వరా! నన్నింకను జిక్కులఁ బెట్టు
చుంటివా?' యని గద్గదస్వరమున నొక్కమాఱు యక్కడనే
చదికిలఁబడెను. సరళాబాయియుఁ జింతించుచు నిలువఁబడెను.
వీరిరువురి దుఃఖమునుగాంచి రత్నాబాయియు నేడువ నారంభిం
చెను. తల్లిచెఱఁగుఁబట్టుకొని మూఁడేండ్ల హరికిశోరుఁడు గొం
తెత్తి యేడువఁదొడఁగెను. అప్పుడిఁక సరళాబాయి తనకుమా
ర్తెనోదార్పక తప్పదయ్యెను. కొంతసేపు వారట్లు చీకాకుపడిన
చిత్తములతోఁ బలవించి లేచిరి. చింతాగ్నిచే దహింపఁబడు
చున్నవారికి భోజనముపైనాశేయి, యిష్టములేకున్నను నొకవి
ధముగ నెఱవేర్చిరి. తరువాత రామకిశోరుఁ డున్మత్తునివలె నే
మియుఁ దోఁపక, నిద్రపట్టక తనపాన్పుపైఁబడి పొరలాడుచుం
డెను.

ఆరాత్రి గడచెను సూర్యోదయమయ్యెను. కాని, రామ
కిశోరుని హృదయమున మాత్రము సంతోషోదయముగాలేదు.
ఆతని దుఃఖసంతమస మింకను నడంగలేదు. ఏకార్యము నొన
రించుటకును నాతనికిఁ దోఁపలేదు. పఱుపుపైలేచి కూర్చుండెను.
తన్నుసమీపించిన కుమార్తెనుగాని, ముద్దు కుమారునిగాని చే





రఁదియుటకు బదులు వారిని గసరికొట్టుచుండెను. అప్పుడు రత్నా
బాయి 'జనకా! యెందులకిట్లు చింతిల్లుట? కాఁగలయది కాక
మానునా? కష్టసుఖములు మనుష్యులకుఁగాక మ్రాఁకులకు
వచ్చునా? అన్నిటికిని బరమేశ్వరుఁడే మూలకారణమనుట దా
మెఱుఁగనిదియా?' తన ప్రియతనయ యీరీతి ముద్దులుగులుక
బలుకుచుండుట, రామకిశోరున కొకవిధముగ సంతసమును గలి
గించునదియే యైనను మనఃకంటకము గాకపోలేదు. కావున న
తఁడీమాడ్కిఁ దనకుమార్తెకుఁ బ్రత్యుత్తర మిచ్చెను. 'తల్లీ!
నీవాడినపలుకు లెంతేనియు మెచ్చుకొనఁదగినవి. కష్టసుఖములు
మనుష్యులకు రాఁగూడదని నేనుమాత్ర మనుచుంటినా? ఏస
మయమున కెయ్యది యాసన్నమగునో యద్దాని ననుభవించుట
నరునివిధియే. కాని నావంటి కష్టజీవిమాత్ర మీభూమినుండఁ
డు. ఆబాల్యముగ నేననుభవించుచుండు కష్టముల వ్రాయఁ
బూనిన నొకగ్రంథమగును. అందును నీవలన నేనిప్పు డనుభ
వించు కష్ట మింతంతకాదు ప్రథమమున నీవు జనించినప్పుడే
మో మమ్ముద్ధరింతువనియు, మేమును సుఖపడుదుమనియు నను
కొనినారము కాని, మాకోర్కెయిట్లు విపరీతముగఁ బరిణమిం
చునని యెఱుంగమైతిమి. నీవు మాకుద్భవింపగ, యేసంపన్నుల
యింటనైనఁ బుట్టియుండిన మాకింత చింతయే యుండదుగదా!
నీవును సుఖపడి యుండుదువుగదా! అయ్యో! మాకు జనియిం

చినకతన నీవెంత దౌర్భాగ్యురాలవైతివి! నీవు మాతోడ నీకష్ట సాగరమున మునుఁగుచుఁ, దేలుచు నుండవలయునని విధిలికించి యుండ నీవేమిచేయుదువు! నీకుఁదగినవరుఁడెట్లు లభింపఁగలఁడు? స్వల్పవేతనముతో సంసారము నే దుర్భరముగఁ గడపుచుండ నీవు జనించితివి జనించినదాది నామకరణమునకని, విద్యకని, వస్త్రములకని, ఆభరణములకని సుమారాఱువందల రూప్యములు అప్పుఁజేసితిని. అందులకుఁ దాకట్టుగ నేను గాఁపురముండు నిల్లును బెట్టవలసివచ్చె. ఇవన్నియు నిట్లుండఁ 'బులిమీఁదఁబుట్ర' యన్నట్లు నీకువరుఁడు తగినవాఁడు లభింపని కష్టమొకటి సంభవించె. నీకు యుక్తవయసు రాకపూర్వమే వివాహముఁజేయ నుద్యమింప 'నైదువేలిచ్చెదవా!' 'పదివేలిచ్చెదవా?' యని వరకట్నము లడుగుచున్నారు. నాయట్టి నిర్ధనుండెట్లిట్టి కట్నములఁ గట్టఁగలఁడు? పోనిమ్ము కట్నముల కాశింపని వారికిత్తమన్నఁ గేవలము విద్యావిహీనులుగను. సద్గుణరహితులుగను, దరిద్రులుగను నున్నారు. ఎఱిఁగి యెఱిఁగి విద్యావంతురాలవును సుగుణశీలవునగు నిన్నట్టి వారికెట్లర్పింతును? నీకా? వయసుమీఱి పోవుచున్నది. వరుఁడా? దొరకుటలేదు. నాకా? దుఃఖమే యిలువేల్పయినటులున్నది, నీవునాక హరికిశోరునివంటి సుపుత్త్రరత్నమైయుండినయెడల నాకింతవగవు కలిగెడిది కాదుగదా! నీవాఁడుదానవుగ దరిద్రులమగు మాకెందులకు జనించితివి!





అఁటా! కుమారీ! అయిదువేల రూప్యములు నేనెన్నాళ్లకార్జింపగలను! ఏమో! ఇప్పటి నాపరిస్థితులం దలంచుకొన్న, దేహము కంపమెత్తుచున్నది. నిన్నుఁ దగినవరునకిచ్చి పెండ్లిచేసి కనులారఁ జూచుభాగ్యము నాకీజన్మమున లేదుకాఁబోలు! ఈలోపున నే నీవిషయమగు పరితాపముచేఁ గృశించి, చత్తునేమో! అయ్యో! భగవంతునికి నాయెడ దయ తక్కువయగుటచే నాకింతటికష్టము సంప్రాప్తించినది! హా! దైవమా!' యని వగర్చుచు బఱిపుష్టి మేనుసేర్చిన తనతండ్రి నింతవనుకఁ దలవంచుఁకొని, యాతఁడుచెప్పునది వినుచున్న రత్నాబాయి చూచెను. ఆమె ముఖపద్మము ముకుళించుకొనిపోయెను. నేత్రద్వయమునుండి బాష్పధారలు గాఱ మొదలుపెట్టెను. ఏమిచెప్పుటకును నామెకుఁ నోఁపలేదు. ఏమిచెప్పఁగలదు! ఏమిచెప్పి యామె తనజనకు నోదార్పఁగలదు! అది యట్లుండనిచ్చి తన జనకుఁడు తన్నాడినవాక్కులొక్కొక్కటి సునిసితశరంబుంబోలె మనంబుననాటి, బాధించుచుండ నీకనామె యేమాటయు నెట్లాడగలదు? ఊరక చింతించుచు నిలుచుండెను. ఇంతలో సరళాబాయి యచటికరుదెంచి, భర్తను గుమారీ కుమారులను భోజనమునకుఁ బిలిచెను. వారికిష్టము లేకున్న బలవంతమున, నన్నముఁదినుటకుఁ బోయిరి.



గీ॥ భావవికలత్వమందిన-వారుధరణి
నిష్టులైనట్టివారి నే-యీనసింతు
రవఁగఁదమచిత్తవికలత్వ-మునకు, హేతు
భూతులనుజూచినప్పుడు-నీతివిడిచి
యెట్టిపాట్లనుబడుదురో-యెన్నవలెనే?





శ్రీ

# రత్నాబాయి.

## పదునొకండవ ప్రకరణము

ప్రభాకరుఁడస్తాద్రిఁ జేరఁబోవుచుండెను. రత్నాబాయి తోడిబాలికలొకకొందఱఁగూడి రంగపూరునందలి బజారువీథిని బోవుచుండెను. ఆమె తన చెలికత్తియతో నిన్నిదినముల వలెఁగుతూహలముగ నేమియుమాటాడుటలేదు. ఆమెయప్పటి స్థితినిగూర్చి, యామె చెలికత్తియ లబ్బురపడుచుండిరి. వారట్లు పోవుచు నావీథిలోని వింతలంగనుచుండ రత్నాబాయి యొక యౌషధాలయమును బ్రవేశించి,-కొంతసేపునకు మరలవచ్చి, తనతోడి చేడియలం గలిసికొనెను. స్నేహితురాండ్రియ్యదికని, 'రత్నా! నీవెందుల కౌమందుల దుకాణమున కేగితివి? నీచిత్తవృత్తిం బరిశీలింప నేఁడొకవిధముగ నున్నయది. కారణమేమి? దేహమేమైన జబ్బుచేసెనా? చూడనట్లేయున్నది. అందులకే యౌషధముఁ గొనుట కౌషధశాల కేగితివి కాఁబోలు.

రత్నా:—కాదుకాదు. మందుఁదీసికొనుటకే నేనేగినను నా

కుఁ గాదాయెను. నాకు దేహమేమియు జబ్బులేదు. నాతల్లి ప్రతిదినమొక యౌషధమును సేవించుచున్నది అయ్యది యైపోవుటచేఁ గొనుటకరుదెంచితి నాకును మనోరుజఁ బోఁగొట్టుటకేయౌషధము పయోగింపఁగలదు అని యేమేమో మాటలాడుచు రత్నాబాయి తనయిల్లు సేరెను.

సరళాబాయి తన పుత్రికారత్నముయొక్క దీనవదనముంగాంచి 'యీమె తన తండ్రియనిన మాటలకు వ్యథనొందుచుండనోవు, నని గ్రహించి 'పుత్రీ! నీమోముఁ జూడఁ గడు వాడియున్నదేల? ఏల? సంతపించెదవు? నీతండ్రి తనకుసంధవించిన చింతావేశముచే నేమోయన్నంత మాత్రమున నింత కుందవలయునా? చింతింపకుమమ్మా' యని కూతుం బుజ్జగించి యన్నముఁ బెట్టెను. రామకిశోరుఁడు భార్యాపుత్రులతోడ భుజించి యా రాత్రి శయనించెను, రత్నాబాయియు తాను బ్రతిదినముఁ బరుండు స్థలమునఁ బవ్వళించెను. కాని యామెకు నిద్దురపట్టలేదు. ఎట్లుపట్టఁగలదు! నాఁటిదిన ముదయమునఁ దన ప్రియజనకుఁడు దన్నాడిన నిష్ఠురోక్త్యాశుగములు చురుకు చురుక్కునఁ దనహృదయముఁ బొడుచుచుండ నామెకు నిద్దుర యెట్లుపట్టును? ఇటుప్రక్క కటుప్రక్కకు బొర్లుచుఁ, దనమనమున నొకవిధమగు రోషాగ్ని ప్రజ్వరిల్లుచుండ, నతిదీర్ఘముగ నుచ్ఛ్వాసములు వదలుచుండెను.





రాత్రి పదునొకండు గంటలయినది. రత్నాబాయి తన పాన్పుపైనుండి లేచిపోయి, తనతండ్రిని జూచెను. ఆతఁడు నిదురవోవుచుండెను. ఆమె యటనుండి కదలి తన తల్లిపరున్న శయ్యయొద్ద కేఁగి యామెను, నామెప్రక్కను బాలచంద్రునిఁ బోలు విశాల ఫాలప్రదేశముతో నొప్పారు తనచిన్నితమ్మునిఁ గాంచి 'మిమ్ముఁ జూచుటిదియే కడసారియా నాకు' నని యేడువ మొదలుపెట్టెను కాని గట్టిగ నేడ్చినఁ దనకార్యమునకు భంగము వాటిల్లునేమో యని చిత్తమును శిలాప్రాయముగ నొనర్చుకొని, తన పెట్టెయున్న గదిలోనికేఁగి, యొక కాగితమును గైకొని, యుద్యానమున కేఁగుదెంచెను. అంధకారమునఁ జెట్లనుధ్య భయంకరముగ నున్నను నాకాంత నిర్భయముగఁ బోయి, యొకచెట్టుక్రిందఁ గూర్చుండెను. మిణుఁగురు పురుగులప్రకాశమును, గీచుకీచుమను మఱికొన్ని పురుగుల శబ్దములును, నాదారిని ధూమశకటాలయమున కేఁగుచుండు కొన్నిబండ్ల కటకట ధ్వనులు దప్ప నామె కేదియును గనఁబడుటయు, వినఁబడుటయు లేదు. అప్పుడామె తనలో నిట్లుతలపోయఁ జొచ్చెను. 'అయ్యో! నేనేల యీఁదుపుట్టువు పుట్టితిని? పుట్టితిఁబో. నాతల్లిదండ్రులకేల దుఃఖముఁ గలిగించుదాననైతిని? ఇట్టి దుఃఖము గలిగించుటకన్న నేనిప్పుడు ప్రాణత్యాగమొనర్పఁ బూనుకొనుట సర్వోత్తమముగ నున్నది. ఎట్లయినను నను గన్నవారలు వరశుల్కపిశాచమువాతఁ బడకుండుటయే నాకుఁగావలయు' న

నుకొనుచుఁ జీరచెఱఁగునఁ గట్టియున్న గాజుసీసా నొకదానిని
దీసెను. దానిని జూడఁగనే వచ్చుచున్న దుఃఖమునామె యాఁపు
కొనలేకపోయెను తుదకు వెక్కి వెక్కి యేడువ మొదలుపెట్టెను.
కాని యామెనట నోదార్చువారెవ్వరు: కడకుఁ దానేయొక దృ
ఢనిశ్చయముఁ జేసికొని, యేడుపుఁ జాలించి, యాసీసాలోని
ద్రవపదార్థమును నోటఁబోసికొన నుంకించెనుకాని యింతలోఁ
దనచిన్నితమ్ముఁడు దృష్టిపథమునకు రా నతని మఱియొకపరిచూ
చి ప్రాణముల వదలఁదలఁచెను వెంటనే యతఁడు నిదురబోవు
చున్న యెడకుఁబోయి యాచిన్నిపాపని నొకపరి ముద్దిడుకొని
'హరికిశోరా! తల్లిదండ్రులకుఁ గీర్తిఁదెచ్చువాఁడవు నీవేసుమా!
యనిపలికి మరలయథాస్థానమునకువచ్చి కూర్చుండెను సీసాను
జేతఁబుచ్చుకొనెను. 'పరమేశ్వరా! నీవేనాకిఁక దిక్కు' అనిపలు
కుచు, నందున్న యౌషధమును మ్రింగివైచెను. ఆయౌషధప్ర
భావమెట్టిదోగాని పదినిమిషములకేనామె హా —యనిమూల్గు
చుఁ బ్రాణములడఁచెను. పరస్కృ పిశాచమునకాయమ తన దే
హామునర్పించినను, నామెయాత్మమాత్రము, దానివాతఁబడక
నిత్యపదవినిబొందెను.

ఆ॥వె॥ తల్లిదండ్రులఁబరి-తప్తులఁగావించి
బ్రతుకునుతుఁడునుతుఁడె-పరమపాప
చిత్తుఁడతఁడుభువిన-జీవుఁడై యుండుట
కంటెఁజచ్చుటెంతొ-ఘనతరంబు॥



శ్రీ

# రత్నాబాయి.

## పంద్రెండవ ప్రకరణము.

సూర్యోదయమాయెను. బాలభానుని ప్రభాపటలం
బులు సౌధాగ్రములకొక వింతకాంతి నొసంగుచుండెను. కాఁపు
ప్రజ యెల్లఁ దోలుకొనుచు భుజముల నాఁగళ్లనుంచుకొని మళ్ల
వైపున కామోదమునఁ బోవుచుండిరి. గొల్లపిల్లవాండ్రు
మందలఁ దోలుకొని పోవుచుఁ గర్ణామృతముగఁ బిల్లనగ్రోవుల
నూఁదుచుండిరి. కొందఱు మహాభక్తితోఁ బ్రభాకరునకు మొల
లోఁతు నీళ్లలో నిలుచుండి నమస్కరించు చుండిరి. సర్వకార్య
ముల నలుపుటకు సాయపడు లోకబాంధవుని రాకకు లోకమం
తయు సంతసించుచుండెను. కాని రామకిశోరుని మందిరోపవన
ము మాత్రము దుఃఖసముద్రమున మునిఁగియుండెను. వేలకొ
లఁదిజనులు రత్నాబాయి కళేబరము చుట్టును మూఁగియుండిరి.
అందు స్త్రీలు, పురుషులు, బాలురు, యువకులు, వృద్ధులు, ధని
కులు, దరిద్రులు.... .... ....యింతేల? వీరువారనక యెల్ల
రును జేరి విలపించుచుండిరి. అందొకఁడు శవసమీపమునఁబడి

యుండు లేఖం దీసి, యెల్లరు వినున నీరీతిఁ జదువఁ దొడఁగెను.

'దైవసమానులగు నా జననీ జనకులకు:—

మీగర్భమున నేను బుట్టియు మీకు సంతసమును గలిగింపఁజాలకపోయితి. నే జనియించినదాది నింతవఱకు నాఁడుపుట్టువనగు నాకొఱకు మీరు పడిన కష్టములు నా కనులారఁ గాంచి నేనెంతయు జాలినొందుచుంటి. నాకుఁ బ్రాయము మించుకొలఁది మీకును జింత మిక్కుటమగుచుండెను. నాకుఁ దగిన వరునిఁ దెచ్చుటకు మీరెన్నియో ప్రబలప్రయత్నములు గావించియు విఫల మనోరథులైతిరి. నన్నొకరికి ధారపోయుటయే గాక నైదువేలో—పదివేలో కట్నములను నెపమున శుల్కములను దురాశాపూరితులగు వరులకు నెక్కడనుండి మీరొసఁగఁగలరు? మొన్న లక్ష్మణపురినుండి శ్యామసుందరుఁడు వ్రాసిన యుత్తరమును జూడఁగనే మీ రత్యంత వ్యాకులచిత్తులరైతిరి. నేను జన్మించుటం జేసి, యింతవంత మీకు గలిగినందులకే నెంతయుఁ జింతించుచు, మీకిట్టి కష్టము లేకుండుటకే నేను బ్రాణత్యాగ మొనర్ప నిశ్చయించితిని. అందులకే నిన్నటి సాయంతనము బజారునకేఁగి విషముఁ దెచ్చి పెట్టుకొంటిని. దానిచే నా యసువులు వదలుచున్నాను. ఇఁక మీరు చింతింపకుఁడు నాకై పరితపించి మనోవ్యాకులతచే రోగములపాలు గాకుఁడు. ఊరడిల్లుఁడు ———— శ్యామసుందరునివంటి దురాశాపూరితు





లును, సంఘవినాశకులును, బవిత్ర చరిత్రయగు భరతమాత గర్భమున జనింపకుందురుగాక! భరతఖండమునం దిట్టి శుల్కముల పద్ధతి మాపు మాపుటకును, నా యట్టి యబలల మానప్రాణములఁ గాపాడుటకును దేశమాత సుపుత్త్రులం గనుగాక! పరమేశ్వరు ననుగ్రహమున గన్యాశుల్క వరశుల్కములును నిఁక మీఁదఁ బ్రపంచములో నడఁగిపోవుఁగాక! నా భారత సోదర సోదరీమణులును గట్నములపద్ధతి మాన్పి, వివేకముతో ధర్మమును సరింతురుగాక! కట్నములమీఁది యాశగల స్త్రీలకుఁ బురుషులకు నే నాదర్శప్రాయనై యుండెదఁగాక! ఇవియే నా యంత్యనమస్కృతులు.

ఇట్లు,

మిమ్ము దుర్భరకష్టములకుఁ బాల్పఱిచిన

ప్రియపుత్రి

రత్నాబాయి.

పవిత్రురాలగు రత్నాబాయి లేఖ యాపట్టణస్థులకే కాక, భరతఖండవాసుల కందఱకును దుఃఖదాయక మయ్యెననుట యాశ్చర్యముకాదు.

తరువాత రత్నాబాయి శవమునకు దహనక్రియ లాచరించుటకై నగరవాసులలోఁ జాలమంది వెంటరా శ్మశానవాటికకు శవముం గొంపోయిరి. ఆమెకు నంత్యక్రియలు శాస్త్ర

పద్ధతిని నడపిరి. కొందఱామె యాత్మకు శాంతినొసగుమని
పరమేశ్వరుని బ్రార్థించిరి. ఆ పురజనులెల్ల శోకసభఁ జేసి,
యందు రత్నాబాయి సుగుణగణములను గొనియాడి, యామె
ప్రాణత్యాగమునకు హేతుభూతమగు శుల్కపిశాచమును దే
శమునుండి వెడలఁగొట్టవలయుననియు, రత్నాబాయిపేర స్మర
ణచిహ్నమొకటి స్థాపింపవలయు ననియుఁ దీర్మానించిరి.

సరళాబాయియు రామకిశోరులు రత్నాబాయి మరణము
వలన చింతచే నప్పుడేవిడనాడి యుండవలసిన మేనులను హరి
కిశోరునిజూచి నిల్పుకొనవలసి వచ్చెను.

గీ॥ తనకుఁగీర్తిని దెచ్చెడు-తనయుఁడైనఁ
దనయయైననుదనుఁ బాసి-చనినఁ దండ్రి
కధికదుఃఖంబుగలుగుట-యరుదె తలఁప
నందఱునునట్టివారికై-యడలుచుండ॥





శ్రీ

# రత్నాబాయి.

## పదుమూఁడవ ప్రకరణము.



రత్నాబాయి దివమునకేఁగిన పదంపడి, తనయింటఁ
గాఁపురముండుటచేఁ బుత్త్రికావియోగ దుఃఖము అప్పుడప్పుడు
తలంపునకు వచ్చుచుండుటంజేసి రామకిశోరుఁడా వీథిలోని మ
ఱియొక గృహమున నివాసమేర్పఱచుకొని, తనకుమారునిఁ జది
వించుచుండెను. హరికిశోరుఁడప్పుడు తొమ్మిదేండ్ల యీడుగల
వాఁడు రత్నాబాయి చనిపోయి యిప్పటికాఱేండ్లయినది. తన
జ్యేష్ఠసోదరి పరమపదముఁ జెందుటకుఁ గారణముఁ బూర్తిగనె
ఱిఁగి యట్టి దురుద్యమమింకను దేశము నావరించి యుండుట
కెంతయుఁ జింతించుచు నద్దాని నెట్లడంతుమా? యని బాల్య
మున నే తలపోయ మొదలుపెట్టెను. ఆతఁడు విద్యాభ్యాసము
నందును, సుగుణ గణములయందును, రూపసౌందర్యము నం
దును, దోడివారలకంటె మిన్నయై, తలిదండ్రులకమందానం
దమును గలిగించుచుండెను. ఇంతేల? రామకిశోరుఁడు రత్నా
బాయి వియోగమువలని చింతనుగూడఁ గొంచెముకొంచెముగ

మఱచుచుండెను. ఇట్లుండ గిరిధరరావుగారు రామకిశోరుని స్వా
మిభక్తిని బూర్తిగ గ్రహించి యాతని కేఁబదిరూప్యముల వేతన
ము నేర్పాటుఁ జేసెను. రామకిశోరున కదృష్టము పట్టుచుండెను.
అతఁడు కొంచెముకొంచెముగఁ దనయప్పులఁ దీర్చుకొనుచుం
డెను. మూఁడేండ్లలో నతనిరుణములన్నియుఁ బూర్తిగఁ దీఱి
పోయెను.

రామకిశోరుఁడు హరికిశోరుని దనమామగారగు నంబికా
చరణు, నూరికిఁ జదువుకొనుట కంపివైచెను. అప్పుడప్పుడు సెల
వుదినములలోఁ దనస్వస్థానమగు రంగపూరునకుఁ దనతలిదండ్రు
లను, బ్రాతచెలికాండ్రను జూచుటకు వచ్చుచుండెను. అతఁడి
ప్పుడు చదువుచున్నది (VI form) ఆఱువఫారము.

ఇట్లుండ రంగపూరునఁ జాల ప్రసిద్ధివహించిన విష్ణుదా
సుబానర్జీగారొకనాఁటి సాయంసమయమున బగ్గిలోఁ గూరుచుం
డి శ్రీధర్ వీధిగుండ వాహ్యాళి వెడలుచుండెను అప్పుడు తన
యింటిగుమ్మముకడఁ బజారుసల్పుచున్న రామకిశోరుఁడు, తన
కుఁ బరిచితుఁడైన యాతనిం గని 'అయ్యా! విష్ణుదాసుగా
రూ! నమస్కృతులు' అనెను. రామకిశోరుని సుగుణపుంజము
లెందఱో ధనికులను, విద్యాధికులను నతనికిఁ బరిచయముగా
వించినవి: అందువిష్ణుదాసుగారొకరు. రామకిశోరుని సద్గుణ
స్తోమములకు సంతసించుచు, నతని నెల్లప్పుడు బొగడుచుండు





విష్ణుదాసు రామకిశోరునిం జూచి
'మీరెంతయో ధన్యాత్ములరు సుమండీ!' యనెను.
రామకిశోరుఁడాశ్చర్యముతో
'నాకు మీమాటలకర్థముకాలేదు. ఎట్లు?'
విష్ణుదాసు చిఱునవ్వు నవ్వుచు.
'అన్నియు మాటలాడుదము. మీరును బండినెక్కుఁడు.'

ఇఁక మఱుమాటాడక లోనికిఁ జఱచఱఁబోయి, యుత్త
రీయముం గైకొనివచ్చి, రామకిశోరుఁడు బండినెక్కెను. బండి
యుఁ గదలెను.

విష్ణు:—అయ్యా! మీకుమారుఁడు మీకుఁ జాలకీర్తిఁ దె
చ్చెను. ఈవార్తాపత్రికం జదివితిరా?" యని తనప్రక్కనున్న
పత్రిక రామకిశోరుని చేతికందిచ్చెను. అతఁడద్దానిఁ గైకొని చ
దువఁదొడఁగెను. అందిట్లుండెను.

"పాటలీపుత్రము నేఁడుగదా యద్వితీయసంఘ సం
స్కరణాభిలాషిం బొడఁగాంచఁ గలిగినది. హరికిశోరునివంటివా
రిదివఱ కెవ్వరును సంస్కరణ విషయమున మనసునకుఁ బట్టునట్లు
పన్యసించువారు లేకుండిరనిన నతిశయోక్తిగానేరదు. ముఖ్యము
గానాతఁడు కన్యాశుల్కము లద్వేషించును. కట్నములనుగూ
ర్చి నిన్నటిదినమాతఁ డుపన్యసించుచుండ సభ్యులేమి-సభా
—లేమి దిగ్భ్రమఁ జెంది, యాతనిమోమునే వీక్షించుచుఁ

గూడుచుండి యుండిరి. ఒకపరి యాతని యుపన్యాసము వినిన యువకుఁడెవ్వఁడును కట్నమున కాశింపఁడు. ఒకసారియాతని యుద్బోధనాకర్ణించిన జననీజనకు లెట్టివారైనను కన్యాశుల్కమపేక్షింపరు. వర్ణింపనలవికాని వాక్చమత్కారముతోడను, న[illegible]హారంగను, నుపమానములతోడను. వేదశాస్త్రోక్త్యుదాహరణములతోడను నాతఁడు ప్రతిదినమును బ్రతివీధిని నుపన్యసించుచున్నాఁడు. అతఁడు స్కూల్ ఫైనల్ తరగతిలోఁ జదువుచుండు పదునైదేండ్ల విద్యార్థి.'' యనిచదివి రామకిశోరుఁడు విష్ణుదాసుంగని 'యిందులకా నన్నింతమీఱ స్తుతిఁజేయుట. దేశమున నెందఱు హరికిశోరులుందురు?

విష్ణు:—'అట్లనవలదు. ఆతఁడు నీసుపుత్రుఁడనియే విచారింపఁ దెలియవచ్చినది.'

ఈరీతి వారిరువురు నింకను నదియో లోకాభిరామాయణము మాటలాడుకొనుచు విహారమువెడలి మరల రాత్రిచీఁకటి పడువేళకుఁ దమగృహములఁజేరిరి.

విష్ణుదాసు బ్యానర్జియొక గొప్పధనవంతుఁడు. సంఘసంస్కరణాభిమాని ఆయూర ననేకసంస్కరణ కర్మ లతనివలననడచినవి. పట్టణమునందు ప్రజలకతనిపైన సామాన్య గౌరవము గలదు. సంస్కరణ విషయకగ్రంథములను, వార్తాపత్రికలలో బ్రచురింపఁబడు చుండునట్టి వ్యాసములను నెల్లప్పుడుఁ జదువు





చుండును. సంస్కర్తలంగన్నఁడును వారి యుపన్యాసముల విన్నఁడును నాతఁడమితానంద మొందుచుండును. కావున నీయాతఁడు రామకిశోరుని సుపుత్రుఁడు సంస్కర్తయగుట కత్యంతసంతోషమందెను. తరువాతఁ బాటలీపురమున నాతఁడిచ్చిన యుపన్యాసములు పదిపదునైదు దినములవఱకును బత్రికలలోఁ బ్రచురింపఁ బడుచుండెను. అంతియకాక హరికిశోరుని చరిత్రము నయితమాతని చిత్రపటముతోఁ బ్రకాశింపఁ జొచ్చెను. ఇందునుబట్టి నిక్కముగనాతఁడు రామకిశోరుని పుత్రుఁడేయైనందులకు విష్ణుదాసునకెంతయో మోదముజనించెను. ప్రతిదినమున నరుదెంచు పత్రికలను విష్ణుదాసు రామకిశోరునికడ కంపుచుండెను.

రామకిశోరుఁడును దనపుత్రుఁడు అంత తెలివిగలవాఁడైనందులకు లోలోన నుబ్బుచునేయుండెను, ఉండదా? సుపుత్రులఁగన్న తండ్రులకుఁ—గీర్తినిదెచ్చు సూనులఁబడసిన జనకులకు—నింతకంటె నామోదదాయకమగు విషయమెద్ది!

గీ॥ జననమందినదానికి—జన్మభూమి
సేవఁజేయుటె ఫలమట్లు—సేవనలుపు
జనుని దేవునివలెఁబ్రజల్—మనములందుఁ
దలఁచుటొకయబ్బురంబొకో—యిలనుజూడ॥



శ్రీ

# రత్నాబాయి.

## పదునాలవప్రకరణము.



గ్రీష్మఋతువతిభీష్మముగఁ బ్రజలవేఁచుచుండెను. సూర్యకిరణములచేఁ బ్రతివస్తువును దపింపఁబడుచున్నను, సువాసనలు వెదఁజల్లు విడిజాది, జాజి,మల్లె మొదలగు పుష్పములును, చందనచర్చలను, స్వచ్ఛమగు కౌముదిసౌభాగ్యమును జనులుకొల్లగ ననుభవించుచుండిరి, అట్టిగ్రీష్మమునందొక దినము రంగపూరపూర్వాలంకార శోభచేఁ బ్రకాశించుచుండెను.హరికిశోరుఁడు పురమందిరమున నుపన్యసించునని పురమున నెల్లెడలఁ జాటఁబడెను, సాయంతనముమూడుగంటలగునప్పటికిఁ జక్కఁగ నలంకరింపఁబడిన పురమందిరమున వేలకొలఁది జనులు గుమికూడియుండిరి, అందు స్త్రీలు, పురుషులు, పిన్నలు, పెద్దలు, దరిద్రులు, ధనికులు నెల్లరును నిండియుండిరి. అంతకంతకు జనసంఖ్య మిక్కుటమగుటచేఁ పురమందిర బహిఃప్రదేశముననే విశాలస్థలమున నెల్లరును సమావేశమైరి. అచ్చటఁ జిత్రచిత్రవర్ణములతోఁ బతాకములెగురుచుండెను. కొంతసేపటికి నాలుగు



గుఱ్ఱములబండి మంగళవాద్య ధ్వనులతోడను, జయజయసినదంబులతోడను నచటికరుదెంచి నిలువఁబడెను. దానిలోనుండి రామకిశోర, హరికిశోర, విష్ణుదాసులు వెలువడిరి. సభ్యులెల్లరొక్కరినొకరు త్రోసికొనుచు, హరికిశోరమహరాజ్ కీ జై, యను ధ్వనులుజేయుచు నతనిని సమీపించుచుండిరి. హరికిశోరుఁడును మందహాస వదనారవిందముతో నెల్లరనుపలక్షించి, కూర్చుండుఁడని ప్రార్థించెను. వారును నట్లే కలకలముఁజాలించి, కూరుచుండిరి. సభ్యులందఱి యనుమతిచేఁ బుష్పమాలాలంకృతుఁడై విష్ణుదాస్ బ్యానర్జి యగ్రపీఠము నలంకరించెను. తరవాతఁ గరతాళధ్వనులు చెలరేగ లేచినిలువఁబడి హరికిశోరుడిట్లుపన్యసించెను.

'దేశీయసోదరులారా! కాలచక్రము దిరుగుచుండు కొలఁది బ్రపంచపరిస్థితులు మారుచుండుట సహజమే. కాని మన దేశము కాలక్రమేణ నధర్మమార్గమునసంచరించుచుండుటఁ జూడఁగ మంగడు హేయముగనున్నయది. మన దేశము నేఁడు అహింసకాలవాలమైనది. అక్రమమార్గమున కాటపట్టయినది. అధర్మమున కిరవైనది. కన్యాశుల్క వరశుల్క పిశాచములకు నెలవైనది దురాచారములకు స్థానమైనది. అకటా! మన దేశమునకెంతటి దురవస్థ ప్రాప్తించె? అయ్యో! నేఁడిది ఆర్యుల దేశమా? ఋషీశ్వరుల దేశమా! జనకాది రాజర్షుల దేశమా! హరి

శ్చంద్రాది సార్వభౌముల దేశమా? బుద్ధదేవునివంటి తపోనిధుల దేశమా? ఔరా! ఎంతధర్మోపేతదేశము నేడెంత యధర్మోపేతమైనది? ఎంత దుస్థితికి వచ్చినది! నిజమైన స్వార్థపరిత్యాగి నేఁడొక్కఁడైనఁ గానఁబడుచున్నాఁడా? నిజమైనయాత్మశక్తి సంపన్నుఁడొక్కఁడైన నగపడుచున్నాఁడా? [లేఁడు లేఁడని కేకలు] కారణమేమి? పూర్వులప్రతిభను దలఁచుకొన కుండుటయే. తలఁచుకొని, యాప్రకార మాచరింపకుండుటయే. మనపూర్వుల కాలమున దేశమెంతమహోన్నతస్థితియందుండెనో, యించుక యోచించిన మీ హృదయములు పరితపింపక మానవు. కాలవిశేషమునఁ బాశ్చాత్య సంపర్కము మనకుం గలుగుటం జేసియో-మఱి యెందువలననో కాని పశుబలమే శ్రేష్ఠమని సంపదయేముఖ్యమని నమ్మియున్నారము. కాని యాధనమెంతవరకు నమ్మదగినదియో-యీ పశుబలమెంతవఱకు విశ్వసింప నర్హమైనదియో యాలోచించుకొనువా రొక్కరును లేరు. సోదరులారా! పశుబల మధర్మసమ్మిళితమైనదనియు, ననాగరక పద్ధతియనియు మనవారింకను నెఱుంగక యున్నారుగదా! వాందుచే నెన్నియో యనర్థములకు గుఱియగుచున్నారు. పశుబలస్వభావులగు వారికిఁ దల్లియనిగాని, తండ్రియనిగాని, తోఁబుట్టువులనిగాని విచక్షణ యుండదు. అట్టివారెంతటి ఘోరకృత్యములకైనఁ బాల్పడుదురనుట కల్లగాదు. పంచమహాపాతకు లనువా





రెవరు? పశువులస్వభావులే. కన్నకూతుల నమ్ముఁగొను వారెవరు? పశువులస్వభావులే. శుల్కపిశాచగ్రస్తులెవరు? పశువులస్వభావులే, ఇట్టిక్రూరవర్తనులు దైవముకన్న ధనమునే యెక్కుడుగఁ బ్రేమింతురు. పుణ్యముకన్నఁ బాపము నేవిశేషముగ నార్జింతురు. ఆధ్యాత్మికబుద్ధియన్న నట్టివారికిఁ గంటగింపు. పశుబలమన్నఁ బ్రాణతుల్యము. అట్టిదురాత్ములు పవిత్రభూమియగు మనభరతఖండమున జన్మింపనేల? [సిగ్గు, సిగ్గు అని సభలోఁ కేకలు] కేవలధనాశా పీడితులై తమతమకూతుల నమ్ముకొను దురాత్ములకింతను, నందును సుగతులు సున్న. తమదారిద్ర్యవిచ్ఛిత్తికై ప్రియపుత్రికల నమ్ముకొనుటకన్నఁ బెద్దబండఁగట్టుకొని కూపమునఁ గూలుట మేలుగాదా? అట్టివారికిఁ బుట్టగతులుండవు. ఇఁక వరశుల్కగ్రహణ పాండితీమండితుల విషయమా? చెప్పనక్కఱయే లేదు. కుమారవిద్యతోఁ బాటు వరశుల్కతృష్ణయు నెక్కుడగుచునేయుండును. అట్టివారిని బురుషవేశ్యలన్న నేమిదోషము? 'అయిదువేలిచ్చెదవా?' 'పదివేలిచ్చెదవా?' రుం. ఏ వఱకుఁ జదివించెదవా?' ఇవి యేవారు జపియించు మంత్రములు. మోటారుకారుఁ దీసికొనుచున్న గర్భాదాన మొల్లను మహాత్ము నేనొకనిఁ గంటిని. మామగారింట స్థితి నెఱుంగక తనయిల్లు గుల్లజేయఁదలఁచు నల్లుఁడొకఁడల్లుఁడా? శత్రువు! ఇట్టిదుర్బుద్ధి విద్యావంతులలోనే కలిగినఁ దక్కనవారిస్థితి

నీకేఁ జెప్పనేల? 'కుమార్తెలఁగన్న సుఖముచాలురా! భగవంతుఁడా!' యని తండ్రులేడ్వ, 'ఇదియేమిదుస్థితి! సంభవించనే' యని తల్లులేడ్వ, 'నూతనదురాచారము లేల పుట్టెనో!' యని అవ్వతాతలేడ్వ, 'మాకొఱకుఁగదా! తల్లిదండ్రులకింతకష్టము సంభవించె' నని కన్యకలేడ్వఁ జేసికొను పెండ్లి యొకపెండ్లియా? దేశమున సద్గుణగరిష్ఠులమని, విద్యావంతులమని యే మొగము పెట్టుకొని నేటియువకులు తిరుగఁజాలిరోగదా! వరుఁడు గుణవంతుఁడా? యని విచారించుటపోయె. విద్యావంతుఁడా? యని తెలిసికొనుటపోయె. అట్టివారలకు సాలంకృత కన్యాదానము లిచ్చుటపోయె. ఔరా! కాలమహాత్వము! అంగవికలు లైనను విద్యావిరహితులైనను, సుగుణహీనులైనను, ముదుసలులైనను ధనమిచ్చువాఁడె తనకన్యకకుఁ దగినవరుఁడు! అనుకూలవతియగు దారను వెదకుటమాని, కట్నములనిచ్చువాఁడె తనకుఁదగిన బాంధవ్యులు! అకటా! వేశ్యావృత్తిని జరించువారికంటె నీవిషయమున మన శుల్కపిశాచగ్రస్తులగు మహానుభావులు దీసిపోయిరో చెప్పుఁడు. యీ విషయమునవొక కవివ్రాసిన పద్యము నుజదివెద. దయతో నాలింపుఁడు.

సీ॥ పదివేలరూప్యముల్-వరకట్నమిచ్చినఁ
గన్యను బెండ్లాడు-ఘనుఁడొకండు,





బి.యే., కుఁజదువంగ-విత్తంబునిచ్చినఁ
బిల్లఁ బెండ్లాడువి-వేకియొకఁడు,
మోటారుసైకిలు-ముందుతీసిచ్చిన
బాలఁ బెండ్లాడుబుద్ధి-శాలియొకఁడు,
గాజులుసంగరాల్-ఘనముగానిచ్చిన
కన్యకఁ బెండ్లాడు-మాన్యుఁడొకఁడు,

తే॥ గీ॥ ఔర! మన దేశయువకులి-ట్లాటవెలఁదు
లైరి. కాలమహాత్వమే-మనఁగవచ్చుఁ?
నీశ్వరునిపూర్ణమౌకృప-యెపుడుగలుగు
నపుడెపోయిట్టిదుర్బుద్ధు-లడఁగవలయు॥

సోదరులారా! నేటిదినమింతకంటె నేనెక్కుడుగఁ జెప్పఁదలచుకొనలేదు. రేపటినుండియు, వరాన్వేషకుల యవస్థలు, కన్యావిక్రేతల దుస్థితి, నీస్థలముననే యుపన్యసింతును. నేటికింతటితో విరమించుచున్నాను.'

అనిచెప్పి, హరికిశోరుఁడు కూరుచుండుసరికిఁ గరతాళధ్వనులు చెలరేగినవి. పిమ్మట రామకిశోరుఁడు తనకుమార్తెయొక్క దుర్మరణమును సభ్యులకుఁ గన్నీరుకాలువలు గట్టునట్లుపన్యసించెను. తరువాత సభ్యులును హరికిశోరుంగొనియాడుచుఁ, గొంతవఱకుపన్యసించిరి. నాఁటిదినమంతటితో సభముగిసెను.

ఈరీతి నైదారుదినములు రంగపురమున రామకిశోరుఁ డుపన్యసించెను. ఆతని ప్రతిభవిని పలుప్రదేశములనుండి యాహ్వానములు వచ్చుచుండుటచేఁ దండ్రియనుమతిని బోవుచుండెను. ఆతఁడు దన జీవితకాలమంతయు నీయుద్యమ ప్రచారమునకే వినియోగింప, నిశ్చయించెను. రామకిశోరుఁ డందులకు సమ్మతించెను.

ఇట్లుండ గిరిధరరావుగారు రామకిశోరుని దనకంపెనీలో నొకభాగస్థునిఁ జేర్చుకొనియెను. అందువలన రామకిశోరుని కుటుంబము సౌభాగ్యవంతమై—కీర్తికాకరమై ప్రకాసింపమొదలుపెట్టెను. ఆతఁడు దేశోద్ధారకుఁడగు దనకుమారునికొక ధనవంతుని కుమార్తెనిప్పించి పెండ్లిచేసెను. కష్టములభూత మప్పటికి రామకిశోరునకు వీడినది. వారికుటుంబమటుపై నిరంతరమానంద సాగరమున నోలలాడుచుండెను.

పాఠకులారా! ఇంతటితో మనకథను ముగింపునకు దెత్తుము వందన మొకటి హృదయపూర్వకముగ నొనరించుటకంటె, గ్రంథముఁజదివి యందలివిషయము గ్రహించినందుల కేవిధముగఁ గృతజ్ఞతఁ దెలుపవలయునో, నాకుఁ దెలియకున్నది. చిత్తగింపుఁడు క్షమింపుఁడు.—

సమాప్తము.

—o—

పాత్రమునకగు తపాలా ఖర్చులన్నియు చందాదారులే భరించుకోవలయును.

మా చందా దారులకు యితరులకన్న నూటికి యిరువది అయిదు రూపాయలవంతున ధరలు తగ్గించి పంపబడును.

చందాదారులుగా చేరగోరువారు వెనుకటి గ్రంథములు, అనుబంధములుకాని కొననక్కరలేదు. వలయునన్నచో వాటినిసహా తగ్గింపువెలలకే పంపబడును.

చిరునామా మారినవెంటనే మాకు తెలుపవలయును.

మాతో ప్రత్యుత్తర ప్రత్యుత్తరములు జరుపవలసినచో తమ చందానెంబరు తెలుపనిచో జబాబువ్రాయుట కష్టసాధ్యము.

రసవంతములగు నాటకములను, నవలలను తదితరగ్రంథములను, మాచందాదార్లుగాని, లేక యితరులుకాని మాకు పంపినచో వందనపూర్వకముగా నందుకొని, ముద్రణాయోగ్యముగానున్నచో తప్పక ప్రకటింతుము.

## గనుక

మా గ్రంథనిలయమునకు మహారాజ పోషకులు, రాజపోషకులు, పోషకులు, సహాయులు, శాశ్వత చందాదార్లుగాను చేరి భాషా యోమదులను బెంచి, విద్యావిహీతను రోగమును గుదుర్పనెంతురని నమ్మియున్నాను.



## విరాళములు.



| | |
|---|---|
| మహారాజ పోషకులు | రు 116—0—0 |
| రాజ పోషకులు | 50—0—0 |
| పోషకులు | 25—0—0 |
| సహాయులు | 12—8—0 |
| శాశ్వతచందాదార్లు | 7—2—0 |

మహారాజపోషకులు, రాజపోషకులు, పోషకులు, సహాయులు. వీరలనామములను, చేరినలాగాయతి మాయొక్క ప్రతి పుస్తకమునందుగో చేర్చబడును.

పోషకులు, సహాయులు, శాశ్వతచందాదార్లు వీరలు ప్రతి సంవత్సరము వారి వారి విరాళములను చెల్లించుచుండవలయును.

మహారాజ పోషకులు, రాజపోషకులు, కార్యములపట్ల సర్వవిధములగు సహాయములు చేయవలయును.

పై అయిదు తరగతులవారికి ప్రతిరెండు మాసములకు వెలువడు ప్రతిగ్రంథమును పోష్టు ఖర్చులు యావొత్తు మేమే భరించుతు వుచితముగాపంపెదము.

మొదటి మూడు తరగతులవారికి మాత్రము మా

గ్రంథనిలయమున ప్రకటించు ప్రతిపొత్తమును వుచితముగా పంపెదము.

మా గ్రంథ నిలయమునకు వొక రాజ పోషకునిగాని, ఇద్దరు పోషకులనుగాని, నలుగురు సహాయులనుగాని, పదిమంది శాశ్వత చందాదార్లనుగాని, చేర్పువారికి మాచే వెలువరింపబడిన వొక నవలను నాటకమును పంపెదము. 25. మంది చందాదార్లను చేర్చినవారికి మా గ్రంథములలోని యేదేని వారుకోరిన వొకపొత్తమును వారికి వుచితముగా పంపబడును.

మాకు ఏజంట్లుగానుండి పనిచేయువారికి మంచి కమీషన్ యివ్వబడును. గాన వివరములకు వ్రాసినచో నిభంధనలు తెలుప బడును.

యిందు వెలువడిన గ్రంథములు.

ప్రథమరత్నము.

## సువర్ణకేసరీ కృష్ణసేన (నవల)

ఆంధ్రభాషయం దక్షరజ్ఞానముకల ప్రతిమానవుడును చదువతగిన యద్భుతకథ. సువర్ణకేసరికై చంపకమాలయును, కృష్ణసేనునికై చంద్రమల్లుడును, పన్నెడి ఉపాయములును, పడెడిపాట్లును, సమర్థించెడి సాహసకార్యములును, తుట్టతుదకు సువర్ణకేసరీ, కృష్ణసేనుల సమాగమమును, సాంతముగా చదివినవారల హృదయ ముప్పొంగి మేనుపులకరించి ఆనందభాష్ప



ముల విడువక మానరు. సందర్భానుసారముగా పెక్కు సాంఘిక విషయములు జర్చింపబడినవి. వెయ్యేల చదువమొదలిడిన అంత్యమగువరకును విడువరు.

వెల చందాదార్లకు రు 0—12—0 } పోస్టేజివేరు.
యితరులకు 1—0—0 }



ద్వితీయ రత్నము.

## కలియుగదర్పణము.(నాటకము.)

కలిపాతనిరసము! ఖలవిధారచండశాసనము!

వృద్ధ వివాహములు-అతిబాల్య వివాహములు-కలియుగానర్థములనియు—యువ్వనకంటకములనియు--ప్రదర్శించుటకు "కలియుగదర్పణమే" దర్పణము. బాలవితంతువగు సుమతిదుఃఖమును చదివిన నెంతటి రాతిగుండెలైనను కరగకమానదు. ఇందలిపద్యములు రసవంతములు. మోహవారధిని మునింగిన జనార్దనుడు ముక్తిమార్గమును చూపును. వ్యభిచారి విరాగియగును. నీతిబాహ్యుడు నీతిబోధకుడగును. ఇది దుండగీడులకు సమ్మెటవేటు. దుష్టయువ్వన విద్యార్థులకు వివేకబోధిని. వేశ్యావృత్తికి దావానలము వెయ్యేల. చదివిచూచిన హృదయమురంజిల్లును.

వెల చందాదార్లకు రు 0—12—0 } పోస్టేజివేరు.
యితరులకు 1—0—0 }

## తృతీయ రత్నము.

———o———

## మనోరమావిజయము. (చరిత్రాత్మక నాటకము)

గ్రంథకర్త.

గండ్లూరి నరసింహారావుగారు

రిటయర్డురివిన్యూయిన్స్పెక్టరు, జంబులమడుగు

యిందు మనోరమ తన భర్తకొరకై పడెడిపాట్లును సాహసములును అత్యద్భుత భయంకరములు, హిల్‌డార్‌దొరవారి దుండగములును. డాక్టరుగారి దయాహృదయమును వర్ణింప నలవిగాదు, విరాగియగు భర్తను సంసారమునకుదించిన పతివ్రతాచరిత్రము. ఇందందు బొందుపరచిన పద్యములు,వృత్తములు, మిగుల హృద్యమములు.

| | | |
|---|---|---|
| వెల చందాదారులకు | రు | 0—12—0 |
| యితరులకు | | 1— 0—0 |

## రానున్నది. (ప్రియదర్శిని)

చిత్రపట శోభితమును, చరిత్రాత్మకమును యగు నవలారాజము. గ్రంథకర్త:—కవివర పాలపర్తి సూర్యనారాయణరావుగారు.

| | | |
|---|---|---|
| వెల చందాదారులకు | రు | 0—12—0 |
| యితరులకు | | 1— 0—0 |



## వెలువడిన ప్రథమ అనుబంధము.

### గండికోట.

ఇదియొక పురాతన పట్టణముయొక్క చరిత్రము. యియ్యది గీతముగావ్రాయబడి ప్రకటింపబడినది. అప్పటివున్నతస్థితికిని యిప్పటిహీనస్థితికిని చదివి తిలకించిన ప్రతియొక్క ప్రాంజ్ఞవుని మానసమునుసహ సంతాపము నొందకమానదు. నేడే తెప్పించి చదువుడు. వెల సరసము.

| | | |
|---|---|---|
| చందాదారులకు ఉచితము. | | |
| యితరులకు | రు | 0—2—0 |

### మా పత్రములందు యితరప్రకటనల రేట్లు.

| | | | |
|---|---|---|---|
| టైటల్ పేజిపయిన | పేజీ 1 కి | రు | 8—0—0 |
| ,, ½ | ,, | | 5—0—0 |
| ,, లోపలిభాగమున | ,, | | 6—0—0 |
| ,, ½ | ,, | | 4—0—0 |
| లోపలిపేజీ డెమ్మీసైజు. | ,, | | 5—0—0 |
| ,, ½ | ,, | | 3—0—0 |
| ,, ¼ | ,, | | 2—0—0 |



ఇతరప్రకటనలు.

---

# విషాంకుశ.

వుపయోగించు విధము.

తేలుకాటు తగిలిన చోటునందు పైకనుపరచిన నల్లని మందులో బియ్యపు ప్రమాణమును, తెల్లమందులో 1-బియ్యపు ప్రమాణమును యెత్తిపెట్టి దానిమీద 1-చుక్క చన్నీళ్ళు విడువవలెను. విడిచినతోడనే బుసబుసయని కొంచెముపొంగును. ఆపొంగు అణిగినతోడనే నిండుగా నీళ్లువిడిచి కడిగివేయవలెను. పై చెప్పినమందు పాము, మండ్రగబ్బ, కుక్క, ఎలుక, మొదలగు విషజంతువుల కాటులకు పై చెప్పిన విధముగా మిరియాలగింజ ప్రమాణం ఉపయోగించవలెను, ఇట్లు ఉపయోగించినయెడల అన్ని నివృత్తియగును. మొదట ఉపయోగించి విషముపోనియెడల రెండవతూరి ఆదేమాదిరీ చేయవలసినది.

పాకెట్టు 1 కి 0—6—0        1 డజను పాకెట్టు రు 3—0—0

యిదియుగాక మావద్ద పలువిధరంగులలో ఖద్దరుకోటు గుడ్డలు సరట్లగుడ్డలు బనియన్లు వగైరా సామానులుదొరుకును

కోటుగుడ్డ గజం 1-కి 1—8—0        సరటుగుడ్డ గజం 1 కి 0—12—0

బనియను 1—0—0

యం. సి. సుబ్బయ్యశెట్టి,
అయుర్వేదిక్ అండు యూనానిడాక్టరు
భారతీ పరిశ్రమాలయము.
చాగలమఱ్ఱి (కర్నూలు డిస్ట్రిక్టు)

# పండితాభిప్రాయములు.

27 అక్టోబరు 1923

## కలియుగదర్పణము

---

యిదియొక కల్పితనాటకము. ఇదికల్వటూల జయరామారావుగారిచే రచింపబడి శ్రీబాలభారతీ గ్రంథనిలయము వారిచేప్రచురింపబడి మాకార్యాలయము నలంకరించినది. ఇయ్యది ప్రస్తుత నడవడికలను క్రోడీకరించుచు సాంఘిక దౌష్ట్యములను ఖండించుచు ప్రదర్శనానుకూలముగ వ్రాయబడినది. ఈనాటక ప్రాశస్త్యమును గూర్చియు రచనావిధానమును గూర్చియు పీఠికను వ్రాసిన వామనరావు గారే విపులముగా చర్చించియుండుటచే మేమంతగా ప్రశంశింపమానితిమి. సర్వజనులకును నర్థమయ్యేడి సులభశైలిని ముద్దులు మూటగట్టునటుల రచింపబడినది. గ్రంథకర్తకు నాటకరచనయందు ప్రథమ ప్రయత్నమే యయ్యును, పిన్నవయస్కులయ్యును తనకుగల దేశభక్తిని, సంఘసంస్కారాభిలాషను ఆయాపాత్రలద్వారా వెల్లడించియున్నారు. కలియుగమందు జరుగుచున్న దుండగములుదురాచారములు విద్యార్థులెటుల భ్రష్టులగుచున్నది, వృద్ధులు యౌవనవతులగు బాలికల పరిణయమాడి పడుపాట్లు, బాలవితంతువుల బాధలు, మాతృభాషాభిమానము మున్నగునవి దినదినము జరుగుచున్నవి. కన్నులగట్టినట్లు గ్రంథమంతయు నిండింపబడినది. భాషాస్ఖాలిత్యములతో బనిలేదు. మనకు కావలసినది భావములు, పాత్రపోషణము. అచ్చటచ్చట అసభ్యములున్నను గ్రంథకర్తను నిందింపజాలము. బాలకవులను దూషించుచు వారియభివృద్ధికి భంగముకలిగించుటకన్న వారలరచనకు చేయూతనిచ్చి తగుమార్గ

వారలకుఁ బ్రిప్పుట భాషాశేవకులధర్మము దత్తమండలములలో బాలభారతీ గ్రంధనిలయమువారు తగినంత భాషాశేవ చేయనుంచి గ్రంథములను ప్రకటింప చదువరులు ప్రోత్సహింపగోరుచున్నాము. వెల రు1-0-0.

చదువరులకు మచ్చునకై యీక్రింది పద్యము ముద్రించుచున్నాము.

సీ॥ తగినట్టినెలవులను ♦ తెగగొరిగించుచు<br>
ముందటిజుట్టును ♦ ముదముగూర్చ<br>
సంధ్యను మాన్పను ♦ సందెవేళనుమంచి<br>
బ్రాందిదుకాణంబుఁ ♦ బరగఁజూపు<br>
జననిని దిట్టించు ♦ జనకుని దూరించు<br>
మనభాషపైరక్తి ♦ మద్దఁంజేయు<br>
స్వేచ్ఛను మాన్పియు ♦ సేవకుఁడైయుండి<br>
సేవకావృత్తిని ♦ జేయుమనును<br>
తే॥గీ॥ మనకుఁగల పూర్వవృత్తుల ♦ మానుమనును<br>
పరుల వృత్తులు మనకేల ♦ పట్టుబడును<br>
తలపగా నాకు పరభాష ♦ తగనిదయ్యె<br>
సేను నిజముగ నాభాష ♦ సేర్వఁజాల.

వెలయువారు—

శ్రీబాలభారతీగ్రంధనిలయము,<br>
చాగలమర్రి, కర్నూలుజిల్లా

---

# సువర్ణకేసరీకృష్ణసేన

27—10—23

ఇదియొకనవల, గ్రంథకర్త, కల్వటాల జయరామారావుగారు, పాపాయపల్లె, కడపజిల్లా, వెలఒకరూపాయి. దీనికిబెజవాడవాస్తవ్యులగు శేతపూడి భగవంతరావుగారు తొలిపలుకును వ్రాసిరి. ఇది గ్రంధకర్తకు ప్రథమప్రయత్నము, బాలభారతీ గ్రంధనిలయమునకు ప్రథమరత్నము. దీనినికృతజ్ఞతనందుకొంటిమి. ముందు దీనినిగూర్చి మాఅభిప్రాయమును తెలిపెదము. ప్రకాశకులు యం. రామసుబ్బాయ్యశ్రేష్టిగారు, చాగలమర్రి.



# సువర్ణకేసరీకృష్ణసేన

---

ఆంధ్రపత్రిక. 3 వ తేది నవంబరు 1923

కల్వటాల జయరామారావుగారు వ్రాసినట్టి యీనవలను పరికించిసంతసించితిమి. స్వంతోపకరములగు కల్పనలుచాలగలవు. ఈనవలకూడశుభాంతమైనదియే. వర్ణనలుకూడ పెక్కులుగలవు. శైలి స్త్రీలకును బాలురకును పామరులకునుగూడ బోధపడునట్లు మిక్కిలిసులభముగానున్నది. వెల 1-0-0.

వెలయువారు —

శ్రీబాలభారతీ గ్రంధనిలయము.<br>
చాగలమర్రి పోస్టు, కర్నూలుజిల్లా<br>
అనివ్రాయవలెను.



వెలువడనున్నది! త్వరపడుడు!

# మేవాడుపతనము. (నాటకము)

సుప్రసిద్ధ కవిశేఖరుడగు బాబూద్విజేంద్రలాల్ రాయిగారి వంగభాషారూపకానువాదము. వారి రూపకరచన జగత్ప్రసిద్ధమగుట వేరుగ వ్రాయనక్కఱలేదు. మానసిచే బోషింపబడిన కరుణరసమును, గోవిందసింహునిచే వన్నెకెక్కిన శౌర్యరసమును, మహాబత్ ఖానుని పట్టుదలయును జదివియే తీరవలయును,

హృద్యములగు పద్యములు, అమృతప్రాయములగు గేయములు, సాహిత్యరసపోషిత గద్యములు, ప్రదర్శనానుకూలము. శ్యాలికోబైండు. అనువాదకులు శ్రీ పాలపర్తి సూర్యనారాయణగారు. సుప్రసిద్ధ హిందీవంగభాషా విశారదులగు శ్రీ జంధ్యాలశివన్నశాస్త్రిగారి పీఠికతోసహా.

| | |
|---|---|
| చందాదారులకు. | రు. 1—0—0 |
| యితరులకు | 1—8—0 |

వలయువారు—

శ్రీ బాలభారతీగ్రంథనిలయము.
చాగలమఱ్ఱి, కర్నూలుజిల్లా:

# ప్రకటన.

మహాశయులారా!

మన దేశములో దేహారోగ్య విషయమై వాత కఫ వాతభేది వాతబద్ధ వాతసంధి వాతవిరేచనాది వ్యాధులనే గజములకు సింహంవంటిదై దివ్యామృతమై బరగు "కస్తూరి" మావద్దయున్నది. కస్తూరిని మన దేశములో కృత్రిమముచేసి విక్రయించుటవల్ల దాని యందలి నిరసనమై నమ్మకము చెడినది. ఆవిధమైన యేలాటి కల్తిలేని శ్రేష్ఠమైన కస్తూరి యున్నది. మేము పరోపకారార్థమై స్వల్పధరలతో మా షాపులో విక్రయించుచున్నాము. గాన మాయభిప్రాయము కనుగొనినవెంటనే వలయువారు ఆర్డర్లు పంపుదురని అనేకవిధముల కోరుచున్నాము.

ధరలు.

| | |
|---|---|
| 1 నెంబరు కస్తూరి. | రు. 25-0-0 |
| 2 నెంబరు కస్తూరి. | రు. 20-0-0 |

ఇట్లు,
సజ్జనవిధేయులు,
డి. వెంకటసుబ్బయ్య,
సి. వి. స్వామి.

**Try One!!** **Try All !!**

***GAIN IS CERTAIN TO ONE AND ALL.***

If you wish to get the Best genuine Musk at the cheapest rate you please communicate to day with:

The Proprietors,

Messrs.

**D. Venkatasubbaiya & C. V. Swamy,**
*Jagadiswaranilayam,*
**CHAGALMARRI, (KURNOOL DT.)**

# ఇతర ప్రకటనలు.

ఇటుచూడుడు! **మాచే తమగృహములనలంకరింపుడు!**

చేతిపనుల నుద్ధరింపుడు!!! వెలసరసము! ఫలమధికము!!!

**మాకంపెనిలో** మంచి పనివారలచే ఇనుముతో చెక్కతో చెయ్యబడి సరియగు మెరుగు వెయ్యబడిన గృహోపకరణములు మిక్కిలి సరసమగు వెలలకు దొరుకును.

గొప్పగా ఆర్డరు యిచ్చువారికి మంచిలాభకరము. తరుణమును పోగొట్టుకొనకుడు. వొకపరి మాసామానులను తెప్పించి వాటిగుణములను కనుగొనుడు.

సామానుల యొక్క వెలల వివరము.

| సామానులయొక్క పేర్లు. | ఇనుము. డజను 1కి | ఇనుము. వస్తువు 1కి | చెక్క. డజను 1కి | చెక్క. వస్తువు 1కి |
|---|---|---|---|---|
| సాదామడతకుర్చి (దళసరియినుపపట్ట) | రు. 41 0 0 | రు. 3 8 0 | రు. 50 0 0 | రు. 4 8 0 |
| డిటో [సన్నయినుపపట్ట] మేలురకం చేతుమడతకుర్చి | 35 0 0 | 3 0 0 | 65 0 0 | 6 0 0 |
| మడతకుర్చి [చేతులుకలది] | 45 0 0 | 4 0 0 | 110 0 0 | 10 0 0 |
| సాదాయీజీచేర్ ఆకుపచ్చ కాన్‌వాస్ పట్టతోసహా | 80 0 0 | 7 0 0 | 80 0 0 | 7 0 0 |
| డిటో చేతులుకలది | 100 0 0 | 9 0 0 | 100 0 0 | 9 0 0 |
| క్యాంపుకాటు [పట్టతోసహా] | 170 0 0 | 15 0 0 | 110 0 0 | 10 0 0 |

2

| సామానులయొక్క పేర్లు. | ఇనుము. డజను 1కి | ఇనుము. వస్తువు 1కి | చెక్క. డజను 1కి | చెక్క. వస్తువు 1కి |
|---|---|---|---|---|
| వలచట్టము. | రు. 20 0 0 | 2 0 0 | 20 0 0 | 2 0 0 |
| ఫుయ్యలకుర్చి [పట్టతోసహా] | 220 0 0 | 20 0 0 | | |
| రాకింగుచేర్ (పట్టతోసహా) | 80 0 0 | 7 0 0 | 90 0 0 | 8 0 0 |
| క్యాంపుఫోల్డింగు టేబల్ [3 x 1¾ x 2½] అడుగులు | 110 0 0 | 10 0 0 | 65 0 0 | 6 0 0 |
| డిటో [వొకడ్రాయరు] | 140 0 0 | 12 0 0 | 90 0 0 | 8 0 0 |
| క్యాంపు ఫోల్డింగు స్టూల్ | 28 0 0 | 2 8 0 | 32 0 0 | 3 0 0 |
| ఆఫీసు సాదాకుర్చి | ... | ... | 65 0 0 | 6 0 0 |
| ఆరుకాళ్ల క్యాంపుమంచము. | ... | ... | 170 0 0 | 15 0 0 |
| టేబిల్ [3 x 2 x 2½] వొకడ్రాయరు. | ... | ... | 170 0 0 | 15 0 0 |
| డిటో రెండుడ్రాయర్లు | ... | ... | 340 0 0 | 30 0 0 |
| స్టూల్ [1¼ x ¼] | ... | ... | 45 0 0 | 4 0 0 |
| బెంచి [3 x 1 x 1½] అడుగులు | ... | ... | 80 0 0 | 7 0 0 |
| డిటో బ్యాకు | ... | ... | 100 0 0 | 9 0 0 |
| బెంచిసాదా [6 x 1 x 1½] | ... | ... | 130 0 0 | 12 0 0 |
| డిటో బ్యాకు | ... | ... | 170 0 0 | 15 0 0 |
| డ్రాయర్స్ వొకడ్రాయరు. | ... | ... | 195 0 0 | 18 0 0 |
| డిటో రెండుడ్రాయర్లు | ... | ... | 340 0 0 | 30 0 0 |
| బ్లాకుబోర్డు [3½ x 3] | ... | .... | 110 0 0 | 10 0 0 |

| | | | | |
|---|---|---|---|---|
| ప్లాంకులు [Planks 6 x 1] | ... | ... | 55 0 0 | 5 0 0 |
| రికార్డుపెట్టెలు 2 x 1¼ x 1½ | ... | ... | 110 0 0 | 10 0 0 |
| అలమారు. [5 x 3¼ x 1] | ... | ... | 600 0 0 | 55 0 0 |
| డిటో గ్లాసులు | ... | ... | 620 0 0 | 56 0 0 |
| అలమారు [7½ x 4½ x 1½] లోపలి తలుపులతోసహా | ... | ... | 1100 0 0 | 100 0 0 |
| రాటము. | ... | ... | 72 0 0 | 6 0 0 |

షరా:—ప్రతి ఆర్డరున్ను పాతిక మొత్తము అడ్వాన్సులేనిదే చెల్లనేరదు. రెండునూర్ల రూపాయలకు మించిన ప్రతిఆర్డరుకు ప్యాకింగు రయిలుచార్జి ఉచితము. భారీగా ఆర్డరుయిచ్చువారు 15 దినములు ముందుగా మాకు తెలియచేయువలయును. తాలూకు డిస్ట్రిక్టుబోర్డు పనులను కంట్రాక్టు తీసుకొనగలవారము.
వలయువారు దిగువచిరునామాకు వ్రాయవలయును.

సి. గోవిందప్ప అండుసన్సు.
ప్రొప్రైటర్సు,
జగదీశ్వర ఇండస్ట్రీసు.
చాగలమర్రి [పోష్టు]
కర్నూల్ [జిల్లా]

కడప [రైలువేస్టేషన్]

# శ్రీమద్వాల్మీకి రామాయణము



ఇహపరసాధకంబును, సకలజనులకును తారకంబును అగు వాల్మీకిమహర్షి విరచిత శ్రీమద్రామాయణమును ఆంధ్రులెల్లరకు నందుబాటులో నుండునట్లును, పఠనయోగ్యముగనుండునట్లును చేయందలంచి సంస్కృతమునందున్న యీమహాగ్రంథమునకు ఆంధ్రవ్యాఖ్యానము వ్రాయసమకట్టినారము. ఇందు ప్రతిశ్లోకమునకును ప్రతిపదాంధ్రవివరణమును, నానార్థములును, భావమునుగూడ పొందుపఱుచుచున్నారము. ఇదివఱకు ముద్రితములైయున్న శ్రీమన్మహేశ్వరతీర్థీయ, గోవిందరాజీయాదివ్యాఖ్యానములనేగాక, మాకు క్రొత్తగలభించిన సుబోధిని, చాతుర్వర్థిమొదలగు నముద్రితవ్యాఖ్యానములు కూడ పరిశోధించి యందలి విశేషార్థములను పొందించుచున్నారము. ఆయాఘట్టములయందు మనోహరములైన ప్రతిమలనుగూడ వేయుచున్నాము.

ఇయ్యది యత్యంతోపయోగకరముగ నుండుటకై వాచేయఁగలిగినదియెల్లఁ జేయుచున్నారము. మూఁడుమతములవారికిని పారాయణానుకూలముగ నుండునట్లు పారాయణ ప్రారంభశ్లోకములును, సమాపనశ్లోకములును, ఇందు పొందుపఱుపబడియున్నవి. అదియునుంగాక ప్రతిపదార్థతాత్పర్యముతో గాయత్రీరామాయణశ్లోకములు కలవు. మరియువిశేష

విషయసమన్వితమగు గొప్పపీఠికకూడ నిందుఁ జేర్పబడియున్నది. ఇంతయేల, పెక్కురువిద్వాంసులు, విద్యాధికులగు నుద్యోగులు వీరువారననేల ఎల్లరు నీయాంధ్రీకరణవిధానమును బహువిధముల బ్రశంసించియున్నారు. అదియటుండ, సంస్కృతభాషయందు పరిచయము లేనివారిదిచదివిన వారికాభాషయందు ప్రవేశము కలుగుననుటస్వభావోక్తియే. ఇయ్యది రాయల్ సైజున 50 పౌనుల మేలు కాగితముమీఁద దీనికొఱకు ప్రత్యేకముగ నేర్పాటు చేయఁబడిన క్రొత్తముద్రాలయమున ముద్దులుగుల్కునటుల నచ్చొత్తింపఁ బడుచున్నది. మూలశ్లోకము పరిస్ఫుటమైన ఆనంద ప్రెస్సువారి 'ఆంటిక్' అక్షరములలో ముద్రింపఁబడును. సంపూర్ణ రామాయణము ఒకేతడవ కొనుట కెట్టిధనికులకు సులభసాధ్యము కానందున దీనిని మాససంపుటములుగఁ బ్రకటింపదొరకొంటిమి. ఒక్కొక్కసంపుటమున ౧౬౦ పుటల గ్రంథ ముండును.

ఆంధ్రపాఠకమహాశయులారా! మేముతలపెట్టిన యీయుద్యమము కష్టసాధ్యమైనది. సముద్రమున కేతమీఁదుటవంటిది. రామాయణము పూర్తియగుసరికి రమారమి 30 సంపుటములు రాగలవు. ఈపని యొక్కరివలన సాగునది కాదు. భాషాభిమానులును, శ్రీమంతులునగు నాంధ్రమహాశయు లందరి తోడ్పాటువలనగాని యిది సాగనేరదు. దీనికి మేమిదివఱకే సొంతముసుండి రు. 3,000 ల రూపాయలవఱకు వెచ్చించియున్నారము. గ్రంథ ముభయతారకమైనదియు, పఠింపదగినదియుఁ



గావున నాంధ్రులు మాకీమహోద్యమమున నాదరప్రోత్సాహము లొసంగి దీనిని జయప్రదము కావింప ప్రార్థితులు.

# నిబంధనలు.

—చందాదారులు—

ప్రతిమాసము ఒక్కొక్క సంపుటము వెలువడును. అందు నూటయిరువదిపుటల గ్రంథము (రాయల్ సైజున) ఉండును. ఎల్లరకు నిది యందుబాటులో నుండుటకై దానివెల రు 1—2—0 లు మాత్రమే నిర్ణయించినారము.

ప్రతిసంపుటమును గైకొనువారు చందాదారులుగ పరిగణింపఁబడుదురు.

చందాదారులకు సంచికపూర్తియైనవెంటనే వి. పి. గ బంపబడును. (మొదటి సంచిక వెలువడినది. అయ్యది కాగితము హెచ్చుధరలోనున్నపుడు ముద్రింపంబడుటచేత ఆసంపుటము మాత్రము చందాదారులకు 1—9—0 ల కీయఁబడును.)

వి. పి. పోస్టుఖర్చులు చందాదారులు భరింపవలసియుందురు.

చందాదారులు కానివారికి సంచిక చందాదారుల కిచ్చు ఖ[illegible]సన కీయబడదు.

చందాదారులగువారు ముందుగ అ 8 లు ప్రవేశరుసుము చెల్లింపవలెను. రామాయణము సాంతమైనపిదప చందాదారుల కీమొత్తము కడపటిసంచికలో మినహాయింపబడును. ఈలో[illegible] సంచికలు త్రిప్పివేసినయెడల ఈమొత్తము వారికీఁడయ

ఈయబడదు.

—పోషకులు—

రు 58 లు ఇచ్చువారు పోషకులుగ పరిగణింపఁబడుదురు. వారినామములు గ్రంథమున పోషకులపట్టికలో ప్రకటింపఁబడును. వారికిఁ బ్రతిసంచిక ష్టిఫ్ బైండు చేసిపంపఁబడును.

—రాజపోషకులు—

రు 116 లుఇచ్చువారు రాజపోషకులు వారినామములు గ్రంథమునఁ బ్రకటించుటయేగాక వారికి ప్రతిసంపుటము క్యాలికో బైండు చేసి పంపఁబడును.

—ప్రధానపోషకులు—

రు 250 లు ఇచ్చువారు ప్రధానపోషకులు. వీరి క్యాలికో బైండు చేసి, ప్రతిసంపుటము సంపుటయే గాక ఒక్కొక్క కాండము పూర్తియైన పిదప క్యాలికో బైండు చేసి మఱల ప్రతిపంపబడును. వారినామములు గ్రంథమున బ్రకటింపబడును



—మహారాజపోషకులు—

రు 500 లు ఇచ్చువారు మహారాజపోషకులు.



వలయువారు: భమిడిపాటి కామేశ్వరశాస్త్రి,

శ్రీమద్రామాయణగ్రంథమాలాకార్యస్థానము, ఆర్యపురవు

రాజమహేంద్రవరము. అని వ్రాయవలెను

1. 2. 3. 4. 5. సంపుటములు వెలువడినవి. 1-10-24

